# జయంతజయపాలము

ఐదంకముల నాటకము



గ్రంథకర్త:

గరికిపాటి కామేశ్వర్రావుగారు.

పబ్లిషర్సు:

టి. వి. రమణయ్య అండ్ బ్రదర్సు,

నేషనల్ ఎక్సు-డిపో. రాజమండ్రి.




కాకినాడ:

స్కేప్ అండ్ కో., ముద్రాక్షరశాలయందు

క. సుబ్బారాయుడు ఎవిదర్సువారివలన ముద్రింపబడినది.

 1925. [వెల రు 0-12-0.

## నాటకములు.

| | |
|---|---|
| గయోపాఖ్యానము చి॥ ల॥ | 0-8 0 |
| ప్రసన్నయాదవము | 0-8-0 |
| పారిజాతాపహరణము | 0-8-0 |
| పార్వతీపరిణయము | 0.8-0 |
| సంపూర్ణ రామాయణము | 1-4-0 |
| సం॥ ఉత్తర రామాయణము | 1 4 0 |
| సంపూర్ణ భారతము | 1-8-0 |
| సతీసంయుక్త | 1-0-0 |
| వేశ్యాహితబోధిని | 1-0-0 |
| కనకతార చం॥ శే॥ | 1-4 0 |
| డిటో ద్రో॥ సీ॥ | 0-12-0 |
| చింతామణి కా॥ నా॥ | 1-4-0 |
| డిటో చ॥ మా॥ | 1-0-0 |
| చిత్రనళీయము | 1-8-0 |
| రోషనార (శివాజి) | 1-8-0 |
| రోషనార | 1-4-0 |
| గులేబకావళి | 1-0-0 |
| ఫసన్ బకావళి అ॥ సుం | 1-0-0 |
| శ్రీకృష్ణవిలాసం | 0-12-0 |
| గర్వభంగము | 0-10-0 |
| జయంతజయపాల గ॥ కా॥ | 0-10-0 |
| పాండవాజ్ఞాతవాసము | 0.10-0 |
| లంకాదహనము | 0-10-0 |
| పాదుకాపట్టాభిషేకము | 0-12-0 |
| భక్తరామదాసు | 1-0-0 |
| ద్రౌపదీమానసంరక్షణము | 1-4-0 |
| భక్తకబీరు కా॥ ప॥ | 1-4-0 |
| మాలతీ మధుకరము | 1-0-0 |
| శ్రీకృష్ణతులాభారము | 0-12-0 |

## నాటకములు.

| | |
|---|---|
| వసేమిరా | 1-0-0 |
| ప్రహ్లాద | 1-0-0 |
| మార్కండేయవిజయము | 0-12-0 |
| సౌగంధికము | 0 8 0 |
| విజయబొబ్బిలియుద్ధము | 1-0-0 |
| భూలోకరంభ | 1-0-0 |
| మణిమాల | 0-12-0 |
| ధనమహిమ | 0-12 0 |
| దుర్గావతి | 1-0-0 |
| సత్యాబాయి | 0 14-0 |
| సురాజుద్దీన్ లేక అసామాన్య | 0-8 |
| లోకాభిరామాయణము | 0-6-0 |
| భీష్మప్రతిజ్ఞ | 0 12-0 |
| పద్మావతీపరిణయము | 0-12-0 |

## వైద్యగ్రంథములు

| | |
|---|---|
| ఆయుర్వేదసారసంగ్రహము | 0.12 |
| శతలేహపాకప్రకాశిక | 0-8 0 |
| నాడీపరిజ్ఞానము | 0-6-0 |
| పానీయకల్పవల్లి | 0-4 0 |
| ధన్వంతరీ విజయము | 0-10 0 |
| నేత్రదర్పణము | 0-8-0 |

## నవలలు

| | |
|---|---|
| రుద్రమదేవి | 1-8-0 |
| తారాబాయి | 1-8-0 |
| కాళిక | 1-0-0 |
| జయచంద్రవిజయము | 1 0-0 |
| మానసింగు | 1-8-0 |
| మీరాబాయి | 0-14-0 |
| పరమహంసచరిత్ర | 1-0-0 |

శ్రీరస్తు

# జయంతజయపాలము.

గ్రంథకర్త

రికిపాటి కామేశ్వర్రావుగారు

ప్రకాశకులు

వి. పి. రమణయ్య, అండు బ్రదర్సు

నేషనల్ బుక్కుడిపో

రాజమండ్రి.

మొదటికూర్పు.

స్కేపులండు కో., లో కె. సుబ్బారాయుడు అండు బ్రదర్సు

వారివలన ముద్రితము.

1924



వెల, 0-12-0

# ఇందువచ్చు పాత్రలు



## పురుషులు

జయంతుఁడు—కళ్యాణపురాధీశునికుమారుఁడు.

2 జయపాలుఁడు—జయంతునిమిత్రుఁడు.

3 చిత్రకేతుఁడు.—పాంచాలపురాధీశ్వరుఁడు.

4 వీరసేనుఁడు—చిత్రకేతునికుమారుఁడు.

5 జయవర్మ—చిత్రకేతునిమంత్రి.

6 వెంకడు—ప్రభావతివిటకాఁడు.

## స్త్రీలు

1 చారుమతి—జయపాలునిభార్య.

2 సుగుణవతి—చిత్రకేతునిభార్య.

3 మధురవాణి—చారుమతిచెలికత్తె.

4 ప్రభావతి—జయంతునిభార్య.

5 మోహిని—కళ్యాణపురములోని వేశ్య.



శ్రీ

# జయంత జయపాలము.

## నాంది.

ఉ. బాల్యమునందె తాటకినిఁ ॥ బట్టి వధించి తపస్వి యజ్ఞమున్
దుల్యములేక గాచి తన ॥ దోర్బలశక్తినిఁ జూపి జానకిన్
బాల్యమునందె బట్టి దను ॥ వంశవినాశ మొనర్చినట్టి కౌ
సల్యకుమారుఁ డెప్పుడును ॥ సభ్యుల కిచ్చునుఁగాక సంపదల్.

(నాంద్యంతమున సు)

సూత్రి—నటీ! నీవు సత్వరంబటు లొకమారు రమ్మా.

నటి—(ప్రవేశించి) నాథా! తామీదినము నన్నింత వేగమే రాబని చినకతం బేమియో నేనెరుఁగ వచ్చునా?

సూత్రి—నేఁడసంఖ్యాకులగు సభాసదు లిచ్చటికి వచ్చియున్నందున నొకనాటకముఁ బ్రదర్శించి వీరిని సంతోషాంతరంగులుగఁ జేయను ద్దేశించి నిన్నిచ్చటికిఁ బిలచితిని.

నటి—అయిన నే నాటకముఁ బ్రదర్శింపఁ బూనితిరి?

సూత్రి—'జయంత జయపాలమ'ను నాటకము.

నటి—ఈనాటకముఁ జాలమంది రచించిరని తోఁచుచున్నది. అందు నిప్పుడుఁ బ్రదర్శింపఁ బోవు నాటక గ్రంథకర్త నామధేయ మేమి?

సూత్రి—

ఉ. వెంకటరత్నధీరునకు ॥ నొడియు సావిత్రమ్మ సాధ్వికిన్
పంకజలోచనీ: వినుము ॥ ప్రజ్ఞగలట్టి కుమారుఁడీతఁడే

యంకిలి లేనివాడు ఘన । మైన కవిత్వప్రధారయందు ని
ష్కంకమతిన్ రచించెమన । సారవిశాలవినీతిబుద్ధిచే.

తే గీ. సర్వసద్గుణు డీతడు । సదయ హృదయు
డవని నితని కామేశ్వర । రావటంకు
నాటకము వ్రాయనూతనం । బైనగాని
క్రొత్తగా దీతఁడీ జన । గుణులకెల్ల.

నటి—ఓహో ! కామేశ్వరరావా ? ఇతఁడు బాలుఁడే. ఇతఁడెట్లింత
మంది ప్రేక్షకుల నానందాంబుధి నోలలాడింపఁ గలఁడు?

సూత్ర—ప్రేయసీ! ఇతడు బాలుడనియా నీయభిప్రాయము? ఇతడు,

చం. వయసున పిన్నయయ్యుఁదన । భాగ్యవశంబున రామచంద్రునిన్
భయవినయంబు చేత భువిఁ । బ్రార్థనఁ జేయుటవల్లమన్ సభా
ప్రియమున నీతనిన్ గవిత । పెక్కువిధంబుల నాశ్రయించి తా
జయముగ నుండగల్గెను వి । చారము లేకను నీజగంబులో.

మరియు,

ఉ. ఓ సుదతీమణీ ! వినుము । యొప్పుగ వ్రాసెను దీని గట్టి యా
భ్యాసముఁ జేసి సర్వగుణ । పండితవర్యుల నాశ్రయించి యా
యాసమటంచు నెంచక యొ । యారముగా మృదువైన శైలిని
న్వ్రాసిగ నీజయంత జయ । పాలము నెల్లరు సంతసింపగన్.

శా. పాతివ్రత్య మహాత్త్వమెట్టిదియొయొ । ప్పారంగ వ్రాసెన్ యిటన్,
నీతిన్ లేకను భర్త వీడి యతనిన్ । యేడ్పించు కాంతామతిన్
భీతిన్ లేకను దిట్టి పోసెనిట, సం । ప్రీతిన్ జగంబందునన్
ఖ్యాతింగాంచెడి స్నేహమున్ దెలిపెనిం । దాహా! యనన్ ధీయుడై.

కావున మనము సత్వరంబునఁబోయి పాత్రిలను సిద్ధముఁ జేయు
దము రమ్ము. (నిష్క్రమించిరి.)



శ్రీరామ.

# జయంత జయపాలము.

## ప్రథమాంకము.

జయంతుఁడు, జయపాలుఁడు, ప్రవేశము (ఉద్యానవనము)

జయపా.—మిత్రమా, యీప్రమదావన సౌందర్యము గాంచితివా?

సీ. ప్రమదావనములోని ఫలియించె నీపండ్లు
పసిడివర్ణము కాంతి నెసఁగుచుండె
సిందూరరేఖలై చిగురాకులన్నియు
నెమ్మికొమ్మలపైని నిండియుండె
పలువిధఫలములు భక్షించి పక్షులు
యెగురుచుండెను మింట నింపుగాను
రతనాల మించుచు రాలుచుండెను పూలు
వికసించి యెంతయో వింతగాను
తే. గీ. గలిగి చిత్రములెన్నియో వెలుగుచుండె
నివ్వనంబు కాన, మిత్రమా, యిందు నందు
నాగి విహరించి మదిని యా నందమొంది
గృహముఁ జేరంగవచ్చునో కోమలాంగ.

జయం.—సఖా, యీసరోవరముఁ గాంచుము.

తే. గీ జలము ప్రవహింప కాంతిచేఁ గలువపూలు
వెలుగుచున్నవి కొలనందు వింతగాను
మారుతంబులు వీచెనో మరి మరేమొ!
వెలుగుచున్నవిపూవులు మెరుపుచేత.

ఆహా! ఏమియీ నీటివర్ణము!

తే. గీ. కనకమే కాచి పోసిరో కాక కలువ
దళముతో నూరివేసిరో జలమునందు
పసిడినీరును పోలుచు పారుచుండె
చూడచూడంగ నుదికెంతో సొంపుగల్గె
బంగారుకుసుమములో యున్నట్లు జలముం వికసించి ప్రకా
శించుచున్నవి.

జయపా.—మిత్రమా!

తే గీ. రాత్రిబవలును గాలిచే రాలినట్టి
పూవులన్నియు రతనాల పూవువోలి
వెలుగుచున్నవి నీటిపై నలవి కాక
నందనోద్యాన మనగ నానంద మొదవె.

జయంతా! ముందున్న తావులకుఁ బోదమురమ్ము. (నడచి)

జయం.—మిత్రమా! అప్పుడే పొద్దు కుంకుచుండెను. ఇంకున్న చీకటి పడదా? అటుపిమ్మట నింటికేగు టసాధ్యము.

జయపా.—మిత్రుడా, యీరేత్రి యిందునేవరుండి మలయమారుతంబునఁబడి సుఖంపవచ్చును.

జయం.—సఖా! చూచితివా కుసుమసువాసన. ఈవనము స్వర్గమువోలె స్ఫురించుచుండెను. ఎందుజూచినను కోకిలనాదంబులే గదా! ఏవైపుఁజూచినను వాయువే కదా! మనము యీ

రాత్రి యీభవనముననే విశ్రమింపవచ్చును. మిత్రమా! ఆవైపుచూచి సంతోషించుము.

సీ. మందార పూలలో మకరంద మంతయు
తేనెటీగలు పీల్చి తేలుచుండ
చిగురాకులన్నియు చిలుకలు భక్షించి
గూండ్లకేగుచు నుండె పండ్లతోడ
మందమారుత వీచె మనసెంతొ హాయిగా
విలసిల్లు చుండెను వేడుకాడ
బంగారు తగటులై రంగైన కొండలో
గాకేందు డెంతయో రమలుచుండె

తే. గీ. రంగుగల పక్షులెన్నియో క్రుంగుచుండె
మబ్బులన్నియు విరళమై మాయమయ్యె
తారలన్నియురజములై చేరుచుండె
భళిర! ఉద్యానవనమెంతొ వెలుగు గలిగె.

సఖా! వెన్నెలరేడు యాకాశమున ప్రకాశించు చున్నాడు అప్పుడే రాత్రి ప్రవేశించెనే!

ఉ. వెన్నెలరేఁడు యిప్పుడిల వెన్నెలనిచ్చుచు నీవనంబులోఁ
దిన్నెలుపైన కాంతియునుఁ దేటగనిచ్చెను తారలన్నియున్
గన్నుల కింపుగాఁగ హిమ కాంతుని చుట్టును చేరుచుండెనోఁ
దిన్నెలపై సుఖంబుగనుఁ దేటగనందుఁ బరుండవచ్చునో.

జయపా—మనము యిక్కడనే కాలయాపనముఁ జేసినతల్లిదండ్రులు శోకింపరా! అదియుఁగాక

తే. గీ. పాము పురుగులు కోటలోఁ బ్రాకుచుండు
మెత్తలేమియు లేవిలఁ మేలుగాదు
మంచినేలైన లేదింకఁ మాటవినుము
చనుద మింటికి రమ్మింకఁ సరస సఖుడ.

జయం—మిత్రమా! నామాట వినవా? ఈ రేతిరి యిందు వసుండవలె నని వాంఛ గలిగెను. విశ్రమించెదమా?

జయపా—సరే, నీయిచ్ఛవచ్చినట్లు చేయుము.

(నిద్రించిరి)

(మోహిని ప్రవేశించుచున్నది.)

(తనలో) మహారాజుగారు నన్నుఁబిలపించి జయంతజయపాలుర మైత్రి నెట్లయినను భంగముచేయుమని చూఁతిచ్చిరిగదా? (జయంతజయపాలురఁజూచి) ఇదిగో వీరిక్కడనే నిద్రించుచున్నారు. వీరు మేల్కాంచినతోడనేఁ గలుసుకొని మిత్రభేదముగలిగింపవలెను. ఆహా! యేమి శ్రీమన్నారాయణునియొక్కసృష్టి! మనుష్యులొక్కొక్క రీతిగా మెలఁగుచున్నారుగదా! ప్రపంచనిర్మాణము యెంతయో యాశ్చర్యముఁగలుగఁజేయును. ఎందుఁగాంచినను విటునియొక్కవిలాపము లేఁగదా! ఈగడనకత్తెలు యెన్నియో, మాయయంత్రములుఁబన్ని యెంతవయిరాగ్యము బూనినవారినైనసరే లోఁబరుచుకొని వారిదాసులుగనొనర్చుకొనుచున్నారు మాయవేషములుఁ బన్ని విటకాండ్రలవంచించిధనమెంతయినను పొందుచున్నారు. అనేకమిత్రభేదములు కల్పించుచున్నారు. చేయరానిపనులు చేయుచున్నారు. యెంతయోద్రవ్యముయవలీలఁగసంపాదించుచున్నారు. విటులకుఁ బొల్లిబొల్లి ప్రేమలుఁజూపివారిమీదకాంక్షవహించి లోఁబరుచుకొనుచున్నారు. అట్టిమమ్మున్మించువారు యీజగంబునగలరే?

తే. గీ. మాయలెన్ని యొనర్చుచు మాటఁజెప్పి
రాజయినగొప్పవాఁడేని ప్రముఖుఁడయిన
నిల్లుమాన్యముచిటికలో గుల్లఁజేసి
పంపుచున్నాము యింటికిఁ గంపుతోను.

కావున రాజుగారియనుమతి ప్రకారము వీరిమైత్రి పాడుఁజేయవలెను. వీరు నిద్రనుంచిలేచువరకు యీవృక్షము ప్రక్కదాగుండెదను.

(నిష్క్రమించును)

జయం—(మేల్కాంచి) మిత్రమా! లే, లెమ్ము.

జయపా—(లేచి) సఖా! యేమి పిలిచితివి.

జయం—(ఆకాశమునచేయిజూపి) మిత్రమా! చూడుము.

తే. గీ. తారలన్నియువిరళమై జారుచుండె
దీప్తితగ్గనుశశికిని దీపములకు
పలుకుచున్నవి పక్షులు పంజరముల
లెమ్ముయింటికిఁ బోదము యిమ్ముగాను.

జయపా—జయంతా, అపుడు తెల్లవారెను. రాత్రియంతయువినరాని పాడుకలనుఁగంటిని మిత్రమా నామనంబుననేదియో, సందేహముకలుగుచుండెను.

జయం—వయస్యా! ప్రాణమిత్రుండగు నేను నీకు యుండగా నీకు వచ్చెడిలోటేమి?

తే. గీ. ప్రాణమిత్రుడ! నీవింక భయముఁబడకు
సర్వకష్టములందును సాయపడెద
కలదె? మైత్రినిమించిన విలువవస్తు
వేదియైనను భూమిలో నిదియుఁగాక.

జయపా—అవును. మిత్రమా, స్నేహమునకు మించిన శ్రేష్ఠమైనవ స్తువీజగంబున లేదు. అందుమన మైత్రిని గూర్చి చెప్పుటకుందర ముగాదు. భంగముగలిగినను స్నేహమువిడువకుండ యుండుట యే మిక్కిలి శ్రేయము. ప్రాణమైత్రిని విడదీయుటకు నెవరి వనిగాదు.

జయం—మిత్రమా, వేయేల, యిదియొకరివలననగు కార్యము కాదు. మనస్నేహము, పంచభూతములలాగున స్థిరముగా ప్రపంచ మున వెలుగుచునుండవలసిన దే.

చ. దినమణివేడినంతయును దీప్తినితగ్గినతగ్గుగాక భూ
రణములు వచ్చి లోకమును రాజునుగల్పిహరించుగాక పూ
జనకుండు నీకు నాకు సర సంబులు వద్దని చెప్పుగాక, నీ
వినుమికనీదుమైత్రిమది పీడనుపల్కితిదైవసాక్షిగా.

జయపా—ప్రాణమిత్రమా! నాకును గావలసినది, యదియే!

(ప్రవేశము)

(మోహిని యీ క్రింది పద్యము పాడుచున్న ది)

తే. గీ. రూపురేఖవిలాసము చూపునందు
మన్మథునిబోలియుండిరీ మాన్యచరులు
నోటిపల్కులు తేనెలు నూరుచుండ
బోయిమైత్రిని చెడిపెద మాయగాను.

జయం—మిత్రమా, ఆమృదుతరకంఠస్వరంబెవ్వరిది? పాట పాడుట యే కాదు. అడుగులుచప్పుడుకూడ వినవచ్చెను. (మోహినియెదుర పడును)

మిత్రమా! అటుగాంచుము.

చ. నడకలుహంసబోలిరతి । నాట్యముచేయుచువాలుగంటితా
వడివడిపువ్వుదూలికలు । బట్టికరంబునబట్టపాకుచున్
నడుచుచు వచ్చుచుండెయిటు । నాతినిజూడుమనంబునందునీ
పుడమిని నుండిచేసతిని । బోలినకాంతలుమిత్రరత్నమా.

తరుణీశరీరసౌందర్యము చెప్పటకలవికాదు. అటువంటి స్త్రీజనరత్నములు యీపుర్వియందు నుంటిరా!

చ. కనకపుబొమ్మయో! మెఱపుతీగాంతియో? చంద్రునికు పురేఖయో!
వణతియారత్నదీపమొ! సు । పర్వసతీమణిసుందరత్వమో!
వనజదళాయతాక్షీపది । వందలుయిచ్చినసంభవించునే
కనకనిభాంగికంజముఖి । ఖంజనలోచన, పాణిరత్నమా.

మిత్రమా! యీతరుణీరత్నమును సిప్పుడు కరవుదీర, చూడుము.

సీ. పసిడియంభోజమో! । శశిరేఖబింబమో!
ముత్యాలమెరపుయో! ముద్దుమోము
నీలమేఘంబులో! । దొలకరించినతీగో!
భూలోకరంభయో! । పొలతిమిన్న
ఖంజరీటంబులో! । కలువపూరేఖలో!
విరజాజదళములో! । వెడదికనులు
రతనాలపూవులో! । రాకేందుమెరపులో!
దంతంబుచెక్కులో! । దంతసరులు

గీ. పసిడిదేహంబు, పగడంబో! । పలుముమోవి
రత్నమో! వజ్రమో! పూవో! । రజనిసగవు
తళ్కుబెళ్కులుగల్గెను । తరుణిమిన్న
చూడమికభూమియందున । చేడిరూపు.

భళిరా యీయిందుముఖి సుందరపదనారవిందము గాంచినతోడనేయ

మందానందకందళితహృదయారవిందుఁడనైతిని ఇట్టిరాకేందుముఖ నిగూఢనిజన్మమేల? మిత్రమా, యీమె యెవరోయడుగుదమా?

జయపా—పరస్త్రీ సంభాషణమేల?

జయం—వేశ్యకదా!

జయపా—గడనకత్తెయని యెట్లుగుర్తించితివి.

జయం—యెట్లా?

తే. గీ. జారుపైటను వేయుచు ∫ సర్దుచుండె
కోరచూపులఁజూచుచుఁ ∫ గులుకుచుండె
తళుకుబెళుకులు గలిగెను ∫ తరుణియెంతొ
వేశ్యగానొప్పుచుండెను ∫ వేశ్య. యీమె.

జయపా—సఖా, యిప్పుడు, సంసారికి, సానికిభేదము తెలిసినదా? నాట్యకత్తెలుయెంతయో మోసగాండ్రు భూలోకమున యిదియే నీచజన్మము. అట్టివారిని పలుకరించుట శ్రేయముగాదు.

జయం—వారిదియెందుచే నీచజన్మము?

జయపా—వారు పొట్టకై యనేకనీచకృత్యములుచేయుచు విటులనులోబరుచుకొని, యనేక మిత్రభేదములు చేయుచున్నారు.

జయం—దానికేమిగాని, యీజగదేకసుందరిసౌందర్యము గాంచినతోడనే నామనంబామెకైగుంగుచున్నది. కావున, నేటికీయిదానింటికేగుదము?

జయపా—హర, హరా! యెంతమాటాడితివి

మ. అకటా యెంతటిమాటలాడితివిహా! ∫ హామిత్రయేమందునో
యికనీకిట్టులభావ్యమేమదినియీ ∫ యింతిన్రమించంగనీ
కొకమాటన్వినిపించెదోవినుముయ ∫ న్యోన్యంబుగానుండనో
యకటా శ్రేయమెసాధ్వినిన్విడచియ ∫ న్యాయంబుకున్బోవుటల్.

మిత్రమా! ఈఘోరమైన కార్యమాచరించుట భావ్యమే? కురూపివై నను యగ్నిసాక్షిగఁ బెండ్లాడిన భార్యను బాసి పరవనితనుగూడు సంప్రదాయమే? నీవిట్టులరట్టుల పాలుజొచ్చుట భావ్యమా? శూరశిఖామణివై మనసార దైవసాక్షిగా వివాహమాడినసాధ్విని వీడుట క్షేమమే. నీరజనేత్రిసింగలపాలుఁజొచ్చదే? ప్రాణముల బలాత్కారముగా వీడదే?

జయం—సఖా! పరవనిత గాదుగదా! వేశ్యనుగూడుట భావ్యము కాదా?

జయపా—మిత్రమా! వేశ్యలబుద్ధిగమనింపుము.

చ. ఒకనికి జేయిసాపునుమ ఽ రొక్కనిజూచినకన్నుగీటునిం
కొకనికిమాటచెప్పుచును ఽ రొక్కనితోసరసంబులాడునే
రొకనికి వింతచెప్పును మ ఽ రొక్కనికింగబురంపువిందులో
నొకడును లేడు దానికిప్రి ఽ యుండనువారెవ్వడో? రత్నమిత్రమా.

మఱియు

తే. గీ. ధనమునిచ్చినవెంటనే ఽ దయనుజూపి
యఖిలద్రవ్యంబులాగును ఽ యాశతోడ
ధనములేదనిచెప్పిన ఽ దారిజూపి
పంపుచుండునుయింటికిఁ ఽ బడుపుజెలియ.

వెండియు,

తే. గీ. మాయమాటలనెన్నియో ఽ భావమందు
గలిగియుక్తులఁబన్నుచు ఽ గడనకత్తె
విటునిలోబర్చుచుండును ఽ వేశ్యమాత
తేనిపూసినకత్తియు ఽ సానిచూపు.

వేశ్యలుమాయయంత్రములచే నిండియున్నారు.

జయం—

తే. గీ. కులముబోనిమ్ము బాధల ♦ గుడువనిమ్ము
అగ్ని వేడి వదలనిమ్ము ♦ నబ్ధినింక
నిమ్ము, జనకుడు దూషింప ♦ నిమ్ము వేశ్య
మైత్రి బాయుదు వినుమింక ♦ మిత్రినేను.

జయపా—వైశ్యా! వేశ్యాంగనలపొందు హేయముకాదా? అట్టినీవు యజ్ఞాంగంబులోఁబడుట నిచముకాదే!

జయం—

ఉ. చూచితి నెందరో మణుల ♦ చూచితి నెన్నియొ పట్టణంబులన్
జూచితి నెందుజూచినను ♦ సుందరులౌతెలు ముద్దుగుమ్మలన్
వాచవికైన తేనెపిసు ♦ వాంఛనుగల్గిత నామనంబులో
నీచకులంబుగాని మరి ♦ నిందలువచ్చిన నీమె గూడెదన్.

అనేక సుందరులనుఁ జూచితిగాని, యీయందచందంబులుఁగల యింతు ముఖని యెందును గాన లేను. ఈభామామణిని వీక్షించినతోడ నేమరుండు నాపై పుష్పములు వెదజల్లుచున్నాడు.

జయపా—అయ్యో! నీకింతసేపునుండియు నెన్నియో నీతులనుపదేశించుచున్నను నామాటలెక్కింపవేల?

తే. గీ. వినుము కడసారి చెప్పెద ♦ వినుమువినుము
వేశ్యగూడంగ భావ్యంబె ♦ వైశ్యనీకు
మానుమింకను యీబుద్ధి ♦ మాన్యచరిత
చెప్పుచుంటిని మనసార ♦ చెలియకాడ

పెద్దలచే హేయంబుగఁ జూడబడు వేశ్యజాతి నేలనమ్మెదవు. సకలసౌఖ్యసంపదలను బాడుసేయుటకు సూత్రితపడుచున్న వేశ్యమాటలనేల వినియెదదవు. ప్రపంచమందు సర్వప్రాణులచేతను దూషింపబడుచు నేటివఱకు నీచకులంబని యెంచబడుచు, మాయగాండ్రని యెఱింగి

యు, శరీరసౌఖ్యముఁ బాడుచేయు వారనియుఁ నెఱిఁగి వారిమోహావేశ మునఁ బడెదవేల? గొప్పకులంబునఁ జన్మించి కుటిలమానసుల మాటల లోఁబడి యేల మునింగెదవు. బంధుమిత్రములకు విరోధులైన వేశ్యాకాంతల నేల నమ్మెదవు వారిమనోభావము నెఱుంగవా? వారితియ్యని పల్కులకేల యాకర్షింపబడెదవు. గాఢాంధకారమున నేల సంచరించెదవు వారికేల లోఁబడెదవు. అగ్నిసాక్షిగఁ బెండ్లియాడిన సతిని బాయుదువేల? చాలు, చాలు, యింక నీవా సంగతులుగట్టిపెట్టుము.

మోహిని—(తనలో) అదిగో! రాకొమరుండును హితుండును నేది
యో ముచ్చటించుచున్నారు. నేనొకయుక్తి బన్ని యేమగునో
యీప్రాంతంబులడాగి పరీక్షించెద. (ప్రకాశముగా)

తే. గీ. వినుమా విజయపాల రమ్మింక వేగరమ్ము
మంచి మాటను చెప్పెద మాన్యచరిత
కదలి రమ్మింక కాంచుము కరువుదీర
దెచ్చుచున్నాను వింతను చెవినియొగ్గు.

(జయపాలుఁడు పోయి వారాంగనను కలసి మాటలాడును.) (వారాంగన చెవిలో నేదియో చెప్పి నిష్క్రమించును.)

జయపా—ఛీ! కులటా! స్త్రీవి కాబట్టి బ్రతికిపోతివి.

(కోపముతో) తే. గీ. ఆడుదానవు కాబట్టి యఱిగిపోతి
నీవె మగవాడ వైననే నిలువుగాను
చీల్చి మాంసము రుధిరము పీల్చువాడ
అకట! యెంతటి కుటిలవే యాత్మయందు.

(అని జయంతుని సమీపించుచున్నాడు)

జయం—

మిత్రమా? నిన్న వేశ్యాంగన యెందులకుఁ బిల్చె?

జయపా— ఏమియు లేదు. యేదో రహస్యము చెప్పెదనని చెవిలో "వ ద్దగింజలో బియ్యపుగింజ" యనినుడివి తనదారిని తానుపోయెను.

జయం—ఏమి, అట్లుచెప్పిపోయెనా? యీమిత్రభేదముగలిగించు మాటలు యెవ్వరు నేర్చుకొంటివి?

సీ. మాటలెన్నియొగల్గి ॥ మర్మమెంతయొ నేర్చి
మసలుచుంటివి నీవు ॥ మాన్యచరిత
వేషమెంతయొగల్గి ॥ భాషలెన్నియొ నేర్చి
వెలుగుచుంటివినీవు ॥ వేషకాడ
నిజమైనమాటలా ॥ నిజముగా జెప్పుము
కల్లయెప్పుడు వద్దు ॥ యుల్లమందు
మోసపోయితి నేను ॥ చేసితి స్నేహంబు
బుద్ధితక్కువచేత ॥ పొగరుబోత

తే. గీ. అట్టినీతోడ నన్నింక ॥ ముట్టబోకు
చూడకూడదు నీమోము ॥ చెడుగుబుద్ధి
చెంతనుండియు పొమ్మింక ॥ చెడుగునీవు
చెప్పుచున్నాను మనసార ॥ చెవినియొగ్గు

జయపా—మిత్రుడా? నీపాదస్సాక్షిగ నిజంబుపల్కితిని.ఇంకేమియుంగల్ల లేదు.

తే. గీ. అనలసాక్షిగఁ బల్కెద ॥ వినుమునీవు
కల్లచెప్పుటలేదింక ॥ యుల్లమందు
మోసగించిన నాకింక ॥ ముందు ముందు
అనలవాంఛయె ప్రాప్తించు ॥ సఖులచరిత

నేను అగ్నిసాక్షిగబల్కుచున్నను నాయందుదయలేదా.నాసంగతినెరింగియు నిట్లేలపల్కెదవు. దైవసాక్షిగఁ దెలుపుచుంటినే.

జయం—ఓరిమిత్రద్రోహీ, నీసంగతియెఱుంగక మోసపోతిని. ఆహా?
కాలమెంతలో మారెను. టక్కుమారి విద్యలనభ్యసించితివా?
ఆరమణీమణినిఁ గూడఁ దలంచి యనృతవాక్యము లాడెదవే!

తే. గీ. మోసపోతినియెఱుగక | మోసకాడ
ప్రాణమిత్రుడవంచునా | భావమందు
దలచి యారీతినుంటిని | ధాత్రియందు
నట్టినను నీవుముంచితి | వబ్ధిలోను

జయపా—(స్వగతము)అక్కటా యామాయలాడి, యెంతకాఠిన్యంబువహించియీచిత్రంబు బన్నినోఁగదా?ఆహా? ప్రపంచమెంత విరుద్ధముగా నుండెను. అయ్యో! నాయందెప్పుడునునింద వేయని ప్రియమిత్రుడిట్లు బల్కుచున్నవాడేమి? యేమని యాతనితో జెప్పను. (ప్రకాశముగా)

చ. ఎఱుగను దైవసాక్షిమది | యిట్లువచింపగ న్యాయమాన? నే
నెఱుగకపోతి పిల్వ, చెడు | యింతియు నిందలపాలుజేసెనో
కఠిగెను నాహృదంబుకడు | కష్టవహించితి వేలనాదుపై
నరసున తల్లినుంచి మది | సాక్షిగ పల్కెద నమ్మమిత్రమా.

సఖా! పంచభూతముల సాక్షిగ వచింపుచుంటి. సతితోడుగా పల్కుచుంటిని. నామాటనమ్మము.

జయం—దుష్టబుద్ధీ!

తే. గీ. ఏల బొంకెదు మాటలు | కులటవీవు
కూడగానెంచి వేశ్యను | నుడువుచుంటి
బొంకుమాటలు నేటికిఁ | బొమ్ము పొమ్ము
రంకులాడియు నేర్చిన | బొంకులాట

అట్టినీవు నన్నేల కదిపెదవు. ఎంతటివారికైనను ముద్దులాడి వేశ్యనుజూడగనే యీపొగరుబుద్ధి పుట్టకపోదు. ఆహా! చిన్నతనమునుండియు నమ్మి నేను మోసపోతిని. ఆహా! నీబుద్ధి యెంతలో మారెను.

జయపా—(తనలో) అయ్యో నేనేమిచేయుదును? నాకు దిక్కెవ్వరు?

పంచభూతములారా! మీరైనను జెప్పుడు. దైవమా, యాపద్బాంధవా! యెందుంటివి? ఈశ్వరా! నన్నేల దయజూడవు అయ్యో నేనేమియు నెరుగనే ఆమాయవేశ్య నన్నిట్లు నిందలపాలద్రోచివైచెను కరుణాకరా! నన్నేలబాధ పెట్టెదవు? సూనృతవాదినగు నన్నేల చిక్కుపెట్టెదవు. అనృతము నాకేలేశమైనను లేదు అనలసాక్షిగ భావంబు వెల్లడించుచుంటిని. నిష్కారణముగా నన్నేల గట్టుల పాలుఁజేసెదవు శివ శివా! నన్నేల నిర్బధించెదవు. నేను మిత్రద్రోహిని కానే. సకల ప్రపంచ వ్యాపకుడవు. నీవు సూనృత మెరుంగవా? యెరింగియు నన్నేల యబ్ధిని యల్లలాడించెదవు? నీకిది భావ్యమా? అయ్యో యిప్పుడైనను నామిత్రుని గాత్రమునందు ప్రవేశించి యాతని బుద్ధిమరల్పుము వల మిత్రభేదము గావించెదవు ఏలకాగ న్యాయముం జేసెదవు! అయ్యో దైవమా కాపాడవా?

తే. గి. బాధఁబడుచున్న సాధ్వి కాఁ పాడి నీవు
మానభంగముఁ బడుచున్న మానవతిని
ద్రౌపదిని బ్రోచి రక్షించి ధాత్రినంత
సృష్టిజేసిన కృష్ణుడా! బ్రోవుమన్న

కావున యో దీనరక్షకా నన్ను కష్టములనుండి తొలగింపుము అయ్యో నామిత్రునితో నెట్లుమాట్లాడెదను (ప్రకాశముగా)

తే. గి. మదిని నీవింక నన్నిట్లు బాధఁబెట్టి
పాపపుణ్యంబుఁజూడక భావమందు

పలుకుచుంటివి చెడుగైన మాటలెన్నొ
కరుణ గల్గుము రక్షించుము వగసఖుండ

జయం — ఏమంటివి? మూర్ఖా!

శా. ఔరా! యెంతటి మోసగాడవుర, సత్యంబన్న నిప్పాటిదా
మారా కారినిఁ గూడగాఁ దలఁచిసి భావంబునన్ మార్చితే
కూరీరా యేమని పేర్మి నావు మదిలోఁ గూర్మింబునన్ దాల్చితే
పోరా పాపిష్ఠ పాపిష్ఠపాపిష్ఠ మదిలోఁ భోగాలనున్ వచ్చుగా

జడమతీ! నీవిక నా స్నేహంబును కూడ నక్కఱలేదు నేటితో నాకును నీకును మిత్రత్వంబు సరిపోయెను శాల్యమిత్రుడవని తలచియున్న యీ రీతిగా నేటివరకు మాచుచుంటివి ప్రపంచమున నిటువంటి చెడుగులున్నారని తెలుసుకొనలేదు

జయపా — అయ్యో మిత్రమా! యింకను కరుణగల్గలేదా? నీకేల యీ బుద్ధి కలిగెను. న్యాయాన్యాయములుఁ జూడనక్కఱలేదా? నాయందేదోష మేమియును లేదు. నేనెవ్వరిని మోసము చేయువాడను కాను. అన్యాయముచేయువాడను కాను.

జయం — ఇంక నతిప్రసంగము చేయకు.

ఉ. చాలును చాలు నట్టిసర సాలివి యేటికి మానుమయ్యా నే
బేలతనంబుబూని యిపి వేకుడనై చరియించినాడ నీ
పాలిటిస్నేహమింక చెడు భావములబ్బును నీటమున్గితో
జాలము చేయకింక చెడు సంగతులన్నియు గట్టిపెట్టుమా.

ఇంక జవాబులియ్యక గృహంబునకు జనుము. ఈనాటితో నాస్నేహంబు మాని బుద్ధిగలిగి యుండుము.

జయపా — సఖా! కర్ణకఠోరములగు మాటలనాడ భావ్యమా. అన్యాయముగాఁ జూచుట శ్రేయమా? నాస్నేహము త్రోలగుట సాంప్రదాయమా?

మ. సఖుడా నన్నిటు లాడ శ్రేయమగునా । సౌఖ్యంబుగా నుంటి మే
ఇక మీాదన్ సఖుడెవ్వడో వినుము నీ । వే కాక భూమండలిన్
అకటా చెప్పెద పాదసాక్షిగను య । న్యాయంబుగానుండకో
ఇక నన్గాచుము దిక్కులేరు విని నీ । వే నన్ను రక్షింపుమా?

గావున హితోత్తమా! నాయం దెప్పుడును దోషము లేదు. నేను దైవపాదములఁబట్టి చెప్పుచుంటిని. నేనేమయినను దోషమాచరించిన యెడల సర్వకుటుంబ నాశనము జెందుగాక. నాయందు నన్రృత మున్న యెడల భూమాత సాక్షి లేదే? పంచభూతములు లేవే! సర్వజగద్వ్యాపకుండు లేఁడే? నేనేమి యన్యాయముఁ జేసినను నాతఁడు గాంచుట లేదే? నీతోటి బాల్యము నుంచియు మెలంగితిని నామానసము నీకు దెలియదా? నాస్వభావము నెరుంగవా?

తే. గీ. సతిని బాసితి నీవెంట । చరియుచుంటి
తల్లిదండ్రులబాసి, నా । యుల్లమందు
మంచిభావంబు విలసిల్లి । మసలుచుంటి
నన్ను నిటు జూచుచుంటివి । న్యాయమవునె? -

కటకటా? నేనెంత బ్రతిమాలినను నాయందు యనురాగము లేదా?

తే. గీ. కుటిలవైతివి నీవింక । కోమలాంగ
బ్రతిమాలుచుండగ నీకు । భావ్యమవునె
నన్ను దూరుచుంటివి నీవు, । నయముతోడ
చెప్పుచున్నాను వినుమింక । చెలిమి కాడ.

అందుచే నీవు నాయందుఁ బ్రేమం గరిగి నాస్నేహ మాచరింపుము.

జయం—ఓరి ద్రోహీ

ఉ. మాటలు గట్టిపెట్టుము మొ । మాటము లేకను బల్కుచుంటి న
య్యాటము లేల నింక విను । యాత్మవచించె సఖుండ నమ్ముమా

నేటికి నాకు బోధపడె నీ నేరములన్నియుఁ బొమ్ము పొమ్ము మా బోటినిఁ గామమున య్యా వినునీ బూటపు నీపురుని మ్రమించుము.
కాబట్టి నీవుపోయి యావారాంగనను గలిసి సుఖింపుము. నాకడ యసత్య తమాడెదవా? నీకిది పాడియా? నన్ను బ్రతిమాల పనిలేదు.

జయపా—హర హరా! యెంతమాట లాడితివి, నిన్ను బాసి నేనెందు బోగలను. మిత్రమా! నామనంబు పరీక్షించుటకు యిట్టులాడి తివా? లేక నాకర్మఫలంబేనా? నిన్ను విడనాడి క్షణకాలమైనను యుండగలనా? నాపైయింత యాగ్రహ మేల? పాపిష్టినా? నా యందు గరుణింపుము

జయం—(తనలో) ఈ దుర్మార్గుడు యెన్ని కూరకార్యములిదివరలో నాచరించెనో గదా? ఈతని స్నేహము మరిగి సంసారకార్యత కూడ వదలి యాగని వోలె మతిపోయి తిరుగుచుంటిని. కాన యీనోజన మాసుత్తవాగ యుంటిని నోయి సుఖంబుగా నుం డెద

జయపా—హితుడా! నాపై యనుగ్రహింపవా!

జయం—ఛీ! ద్రోహి నీవామాటఁ దలపెట్టకుము. ఆహా! యెంత పని యాచరించితివి. (నిష్క్రమించును)

జయపా—అయ్యో! దైవమా! దుర్గానాధా యాపద్బంధూ దీనద యాళూ! నన్నీరట్టుల పాలుచేయుట పాడియే! సకలధర్మముల కు మూలకారుండవు అట్టినీవు నన్ను నిర్కోపాగ్నిలో బడవేయుట న్యాయమా? నేనునీభక్తుడను కానా! నాయందేమిలోపమున్నది. నేనేమికౄరకృత్యము గావించితిని. నేనేమి చెడుగులుయాచరించి తిని. నేనేమైనాదొంగపనులను జేసితినా? దురన్యాయములు గావిం చితినా? లేక యనృతము భాషించితినా? నాపైకోపావేశము

బూనవచ్చునా! మాయలాడి వేశ్యభూతము మంత్రములుబన్ని
యిట్లు గాఢాంధకారమున బడవైచి స్వలాభము చూచుకొని
పోయెను. ఆహా! ప్రపంచమున యెట్టివింతలు జరుగుచుండెనో
గదా? యెట్టి మహాపాతకములు జరుగుచుండెనో కదా? అట్టియీ
మాయా ప్రపంచములో పుట్టుట హేయము స్నేహితునకిష్ట
ము లేనప్పుడు యీపురమున నివసించరాదు కాన సన్యాసి వేష
ము ధరించి యిష్టానుసారముగా నందందు దిరిగి యేది యెట్లు
జరుగునో పరీక్షించెద (నిష్క్రమించును)

(వెంటనే మోహిని ప్రవేశించుచున్నది)

**మోహిని**—నాతంత్రము బాగుగా నెరవేరినది వీరిరువురి మైత్రిని భం
గపరచినాను అవును ప్రాణస్నేహము విడదీయుటకు యెంత మో
శక్తి గావలయును నేనట్టి మంత్రములం బన్నితిని నేను సాహసిం
చిన కార్యము మరియొకరి వల్లనగునా! వేశ్యజాతియే భూలోక
మున గొప్పది అట్టి మమ్ము మించువారీ భూలోకమున గలరా?
నాపని నెరవేరినది కనుక రాజుగారిదగ్గర బహుమానముగొని
యెద.

(నిష్క్రమించును)

ప్రథమాంకము సమాప్తము)





# జయంతజయపాలము.

## ద్వితీయాంకము

పాంచాల పురము, (ప్రభావతి సౌధము)

ప్రభావతి(ప్రవేశించి తనలో)అకటా! నానాథుండు వచ్చెను గదా! యింకెంత మాత్రమూట సాగుటకు వీలు లేదు ఇంతయు నాకురవస్థయే గదా! యింతలో నాభర్త మాయింటికి రాడని తలంచితిగాని యీరీతి గాదలప లేదు. నేనుయాలస్యమున పునఃనా కెంత యోభీతిగానున్నది. ఆమేదరికి నా యందు యేమికోపము సంభవించునో గదా! యేలనాకీ పాపమునకు. సరే యేది ట్లాగ జరుగునో యాలోచించెద.

(జయంతుడు ప్రవేశించును)

జయం—ప్రేయసీ యింకను మేల్కొంచియే యుంటివా? నిన్నువీడి నా దాపుగా రెండు వత్సరములు గావచ్చెను. నేను నిష్కారణము గా దుష్టమిత్రు(లు) యొకని వెంటబెట్టుకొని నానాదేశములు సంచరించి చివరకుయాస్నేహితుడు నన్ను మోసగించగా నేనువిరోధముగావించి వేరై యింటికి దిరిగివచ్చితిని.అప్పటినుంచియు నీ మీదమనసు గలిగి మీపురమునకు వచ్చితిని.

ప్రభా—నాథా యిప్పుడే నిశిరాత్రిగావచ్చెను.దాదాపుగా రెండుగంటలయ్యెను. మేల్కొంచిన రోగమువచ్చునుగదా! పరుండుదమా ?

జయం—చెలీ! నీయిష్టమువచ్చినట్లుగావింపుము. (పరుండిరి)

(తెరవాలును)

(ప్రవేశము. జయపాలుఁడు) (సన్యాసి వేషముతోనుండును)

అకటా దైవమా! యెంతపనిగావించితివి

ఉ. ఏమియొనర్చువాఁడ నిక । నేదియొమార్గము వేశ్యగూడుటల్
పామరుడైతినేను మది । పాపములెన్నియొ! యాచరించితిన్
వేమరుపాటులేక హితు । నెంతయుదల్చుచు, గానసంబులో
రాముని నే భజించుచు విరా । గముతోలేకను మెల్గుచుంటినో.

ఆహా! యీరీతిగా సర్వకాలసర్వావస్థలయందును నాప్రాణమిత్రుండగు జయంతుని సర్వమనియు నెంచి భజించుచున్నాఁడను. అట్టి పరంధాముడు గాముడు మామిత్రత్వము వేశ్యపూర్వకముగా భేదము చేసినాడు. అయ్యో! సఖా నిన్నుయెన్నిమారులు తల్చుకొనుచుంటిని. నీవేనాప్రాణమనియు దైవమనియు నెంచి నీతోడనే సర్వదేశములు సంచరించితిని. అట్టినన్ను నీవుయానాడు నిందలువైచి దూరరానిమాటలు నెన్ని భాషించినన్ను నొంటరిజేసి యీవీథులపాల జేసితివా? (ఆలోచించి) అయ్యోదైవమా! నీవేల నన్ను కరుణజూడవు? ఆహా! కాలమంతయు నొక్కరీతిగా నడువబోవుకదా? యొక్కరీతిగాగడుపుటకు నెవ్వరిశక్తియుగాదుగదా? తృటిలో నేమిసంభవించునో యెవ్వడెరుగగలఁడు. ఆహా! ఆవేశ్యవలననేకదా యీసన్యాసివేషము సంభవించినది అయ్యో దైవమా! నన్నేల వ్యాకులపాలు చేసెదవు ఇదినీకు న్యాయమా? ప్రపంచసృష్టికర్తవై నావంటి యనురాగపాశములను వేరుపరచి యీ మహాసాగరమునముంచివైచి పైకిలాగుచుంటివి

తే. గీ. లోకములబ్రోచు తండ్రివి । లోకకర్త
ప్రాణులనుసృష్టిచేసిన । పరమపురుష
నన్ను బాధమార్గంబున । నడుపుచుంటి
వెందలేనింక బాధలు । సందతవయ!

(ఆలోచించి) ఇదియేకదా! నాహితుఁడగు జయంతుని భార్యగృహము అయ్యో! యతనిపైనుండు ప్రేమానుబంధము వీడలేక యాతనివెంబడించి నేనును తిరుగుచుంటిని. ఎట్టకేలకు యాతని భార్యగృహము చేరితిని. అకటా! యిప్పుడు నేనేమి చేయుదును? మాకు యీరేయి దిక్కెవ్వరు! దైవమే దిక్కు లేనివారికి దిక్కు కావున యీరాత్రి యీయరుగుమీద నేఁబరుండెదను (పండుకొని) అయ్యో! మిత్రుడా! మనమెంత యన్యోన్యరాగంబున మెలంగితిమి. నేఁడు కదా నాకీదురవస్థలు సంభవించెను. హా మిత్రమా!

మ. నిరతంబున్ ఘనమైత్రిఁ గూడి తిరిగినే । నీయింటనే యుండి నీ
కరలీలం బడి మెల్గితిన్. దినితిను । కంచంబులో, శయ్యలోఁ
బరమానందము నొందుచున్ గలసి నీ । భావంబులో నుంటి నీ
నరకంబున్ బడి మాడుచుంటి నకటా । న్యాయం బె నీకిట్టులన్.

మిత్రమా నిన్ను బాసినదాదిగా నాకెట్టికష్టములు ప్రాప్తించుచుండెనో చూలింపుము. నన్నేల యీఘోరన్యాయముల పాలు జేసెదవు. ఆనాడు యెన్నియోసారులు బ్రతిమాలి యనలసాక్షిగ మనంబున యేమియు కల్మషంబు లేక సర్వంబును నుడివినను నాపై కోపావేశంబున యనేకసందలవైచి పోతివిగదా యానాడు మొదలుకొని యీరీతిగా బాధల జెందుచుంటిని.

సీ. కటికిరా నేలపై । కష్టంబులొందుచు
శయనించుచుంటిని । సారసాక్ష
సిద్ధిభోగములేక । నిందలెన్నియొ జెంది
తిరుగుచుంటిని నేను । పురమునందు
పడరాని యిక్కట్లు । పడుచునుంటిని నేను
కలనైన యెరుగను । చెలిమికాడ
ఏనాడు పుట్టెనో । యీనాడు పడుచుంటి
కలతలెన్నియొ నేను । కన్నతండ్రి.

తే. గీ అట్టినను నీవు విడనాడి యాత్మయందు
మసలుచుంటివి మిత్రుఁడా మైత్రి వీడి
యెన్నఁడైన నన్నిన్ను నా కన్నులార
చూచుకాలంబు యబ్బునో సొంపుగాను.

సఖా! ఈదురన్యాయమేల సంభవించెనోయి?

చ. మెలఁగితి మొక్కప్రాణమున మేనులు రెండుగ నొక్కయింటిలో
కలిగితిమయ్య పెద్దలయి కాలమునంతను నొక్కరీతిలో
చలనములేక నేగడిపి సర్వము నీకునధీనమైతినో
కలవరమొందుచుంటిసఖ కక్షవహించితి వేలనాకుపై.

అట్టినన్ను నీవు దూరవస్థలపాలు జేయుచుంటివి. ఇది నీకున్యాయమా. అకటా! దైవమా నామిత్రునికి కనుబుద్ధిమఱపు లేదా? అయ్యో యిదియంతయు నాపూర్వజన్మసుకృతము. కావనంతటి మనంబెల్ల సుపాసు చేసితివిగదా. నిత్యము నొకచోటనే భోజనము చేయుచు ప్రాణమైత్రితో మెలఁగుచున్న నామిత్రుని, నన్ను వేఱుపఱచుట న్యాయమా? ఇది నీకు భావ్యమా? అయినను కాలమెట్టివారికైన నొక్కరీతిగా గడుపుట దుర్లభము. అయ్యో నేనెందుపోవువాడను. నాకింకెవరుదిక్కు. ఎప్పటికైనను స్నేహితునిం గలసి సంభాషించుభాగ్యము వచ్చునా? ఆభాగ్యంబు లేకపోయినను యాతని సుఖకమలదర్శనంబు చేతనైనను నా మనసులోనికోరిక నెరవేరునా? నామిత్రుడు లేనిదే నాకీసంసారమెందుకు? (ఇంచుక యూరకుండి) అయ్యో నిద్రపోవుదమన్నను రాకున్నదే? అయ్యో! యింతవఱకును మిత్రునిగలిసినట్లేయున్నదే? (ఆలోచించి) చీ! యింతకును మనమైత్రిని భంగము చేయుటకు కారణము వేశ్యాభూతమే కదా? (మోహిని నుద్దేశించి) హా! యెంతటిపాపురాలవే. మామైత్రిని భంగముగావించి యేమిపుణ్యము కట్టుకొంటివి. స్త్రీవైతిగాన బ్రతికిపో

నా నాథుఁడు నిద్రలేవకపూర్వమే తిరిగి వచ్చెద. (నిష్క్రమించుచున్నది)

జయపా—(ప్రభావతినివీక్షించి)ఏమిది! నాకునన్నునకు చాలా యాశ్చర్యము గొలిపించుచున్నది. ఈనిశీథమున యీతరుణీ శిరోరత్నము యెవ్వరోఁగాని యొంటరిగా నెక్కడికో బోవుచున్నది. ఈయర్ధరాత్రి నేమిపనియుండును. ఇదియంతయు మాయగా నున్నది. (ఆలోచించి) ఈమె యంతఃపుర పరిచారిక కాఁబోదుగదా? అయినను ఈ యర్ధరాత్రిమున నేమిపనియున్నది. అయినను యీమె ముఖారవిందము రాజస్త్రీనిబోలుచున్నది. కాని నాకు యేదియో మనంబున యించుక యనుమానముదయించుచున్నది. ఈమె యెవరైన నేమి? యెక్కడికి యేగునో యీమెను యనుసరించి పోయెద. (నడుచును)

(అంత తెరలేచును.)

(మేదరిగృహము.)

(ప్రవేశము మేదరివెంకడు తనలో) అయ్యో! అయ్యో! యీ యాల సాలాపొద్దోయింది (ఆకశముకజూచి)అబ్బో తెల్లారవచ్చేతరం సాలాదూరంపోయింది. నాసిలకలకొలికి, హంసముద్దులగుమ్మ నామిత్తురాలు ప్రభావతి యింకా రాలేదేంసేత్రో ? ఆరాసగున్న మొప్పాకువచ్చునా యని, నాకన్నులు సూడలేక గుడ్లోతున్నాయి. అబ్బా నాపానం యిసుగుతోంది. నామాటయిందగదా! మరాదలేదుకద. నేనెన్నోసార్లు పెండలాడే రమ్మంటే నిక్కీసిల్లివత్తాది. అయ్యో మారాసం యెవరికి తెలియలేదుకదా ! తెలిత్తే నాపాణాలు పోయాయనమాటే. ఈరాచోరుపిల్ల నాపాణాలు పీకిత్తుందేమోనని భయంగావుంది. ఆనొ యీరిబాను తిప్పకోడంచూత్తే నావొల్లుజలకిరోత్తుంది. యింతకునా యదురుట్టంసేత రాచోరిపిల్ల యిలాకా కుదిరిందోయి, కొంపతీసి మొగుఁడుకాని రాలేదుగందా! అందుచేత యాలస్యం యయిందేమొ

యీయాలరానీసెప్తాను కర్రిచ్చుకొని నాలుగుబాత్తేకాని బుద్ధిరాదోం యి! యిదివచ్చిందాకా పడిశపులుపడి పసంతామానుకొని యిక్కడనే యేడాలిగందా. నాపాణం యిసుకుతోంది (ముందుజూచి) అద్గో! అద్గో! యిప్పుడు నాయంచగున్న పభావతి వత్తోంది! రాని! రాని!

(జయపాలుడు రహస్యముగా దాగుకొనును)

(ప్రవేశము ప్రభావతి తనలో) అయ్యో యీతను నాయందు చాలా యాగ్రహముగలిగియున్నవానివలె గానబడుచున్నాడు. ఈతడు నన్ను కొట్టునుగదా! కానియిట్లు యీతనికి నేను సర్వదా యాధీనమైనప్పుడు లొంగియుండవలసినదేకదా! అయ్యో యిక్కడనాసాధుండు లేవలేదుకదా! కానియిట్లు దైవకృతమెట్లున్నదోకదా!

శాక — ఓసీరానపిల్లా వొచ్చేసినావటే, యీయాల యింతాలస్సము యినదేమి? నిసికేల యీయిందికదా త్వరగా రా వక్కరలేదు? యీయాల నాకు సాలాసాలా కోపంగావుంది. నీకోసం యెదురుచూస్తోనాను. నాలో లొంగియున్నప్పుడు త్వరగా రావాలా యక్కర లేదా! ఇద్దోచూసుకో యీ యెగురుబద్దయిచ్చుకొని యీపుచితకకొడుతాను ఓసేయిపిల్లా యింతజాగేలసేసావే?

జయపా — (తనలో)

తే. గీ. నీచకులమునఁబుట్టిన । నీచగాని
పట్టియీభామతిరుగుచున్ । భావమందు
యేమిచేయఁగదలిచెనో । యిందియీమె
భర్తయెవ్వరోయీమెకుఁ । బాపమకట.

అకటా యీమెయెవ్వతెయో దెలియదుగాని వీడుమాత్రము మేదరియని తెలియుచున్నది. ఇంతకు కాలానుకూలముచుబట్టి పనులు జరుగుచుండెను. అయినను యీమె మేదరికి యేమిప్రత్యుత్తరంబిచ్చునోచూచెదను.

ప్రభా—ఓయీ మేదరినాయకా! నేను నాభర్తయరుదెంచుట
చే యింతయాలస్యమైనది. కావున క్షమింపుము.

జయపా—(తనలో) ఆహా! కాలమహిమ యెట్లున్నదోగదా? ఇదంత
యు నామనసునకు చాలావింతగ దోచుచున్నది. వీఁడు మేదరికు
లంబున పుట్టినవాఁడు. యీయింతి గొప్పకులంబున జనించినదా
నివలెయున్నది. మేదరివానితో నీమెకు యేమికార్యముండును?
ఆహా! ఇప్పుడు కొంచెము గోచరమైనది. ఈమెతప్పక యీపు
రము నేలు రాజపుత్రికై యుండును. అదియుగాక నామిత్రుడగు
జయంతుని భార్యయై యున్నట్లు తోచుచున్నది. నేటిరోజున యీపుర
మునకు యరుదెంచినవాఁడు నామిత్రుడే. "నేటిదినంబున నాభ
ర్త వచ్చుటచే యాలస్యమైనదని" యొక్క వక్కాణించుచున్నది.
కావున యీమె నామిత్రుని భార్యయై యుండవచ్చును. యుండ
వచ్చుటయే కాదు యీమె జయంతుని భార్యయని నాకు దృఢ
ముగాఁ దెలియుచున్నది.

తే. గీ అకట! కాలమంతయు మారెనే యోగిసిచూడ
భర్తవిడనాడి, విటకాండ్రనే పక్కజేరి
చేయుచుండిరి పనులెన్నొ నే నాయగాను
వీరుపతివ్రతలంచును నే వెలుగుచుండె.

అయ్యో, దైవమా నీయొక్క ప్రపంచమీరీతిగా ప్రబలుచుండెను. ఇ
దంతయు కాలానుకూలము అయినను నేను ముందుగ దొందరపడనే
ల. ఇఁకముందు నేమిజరుగునో చూచుచుండెద.

వెంక—ఏమీ నీమగడు వచ్చాడా! జయంతుడునే?

ప్రభా—అవును.

జయపా—(తనలో) అకటా! స్పష్టమయినది. ఈరఘునిజయంతుని భా
ర్యయేకదా? దైవమా యిందుకేమని చింతించెదను.

ఉ. పుట్టెను రాట్కులంబునను । పుట్టెను యీచెడుబుద్ధిలీమెకున్
పట్టెను మేదరీ మదిని । పాపమటంచును నెంచకుండతా
రట్టులపాలుజెందునని । ప్రౌఢయు నెంచకనుండె పీగిఎన్
గట్టినికట్టుకట్టివల । కాటికిపంపిన పాపమున్దునే.

మరియు

చ. కటకటయెంతఘోరమిది । కావరమొందెను రాజుబిడ్డయై
విటులనుఁబట్టి యీమెచెడు । వేషము వేయుచు నర్ధరాత్రియున్
భటులను కానకుండసిటు । భాసుమువచ్చెను నాకుగుండెలోఁ
దటతటమాంచు కొట్టుకొనె । ధారుణియందును గాంచసట్టెదిన్.

వెండియు.

ఉ. ఎక్కడిరాజవంశమిది । యెక్కడి మేదరినాయకుండు యీ
చక్కనిమేలుబంతిమది । సంగతులేమియు గోచరించకున్
జిక్కెను వీనికిన్ మదిని । సిగ్గునుపూనక భర్తనింటిలోఁ
బక్కలోనుంచితానుకడు । పాపమటంచును నెంచకొచ్చెనో.

(ప్రభావతిని నుద్దేశించి) ఓసీ! చెండాలి, నీవు వేశ్యవైజన్మించుటకు మారుగా రాజవంశమున పుట్టితివి. నీమూలమున నెంతమందికి యప్రతిష్టవచ్చుచున్నదోఁగదా? అయ్యో నీభర్తయుదియెఱగలేక పోయెగా.

తే. గీ. పాపమంచును యెంచక । భావమందు
పతినివీడుచు యీరీతి । ప్రబలుచుంటి
నీవుమేదరిగూడుచు । నీల్గుచుంటి
కులటవై యొప్పుచుంటివి । వెలదినీవు

అయ్యో నీభర్తనిన్ను యెంతయో గుణరాసిగా చూచుకొనుచుండ నీ విట్టులరట్టులపాలుజెందుచుంటివా పాపి! నీవెంత నీచురాలవే?

వెం—నీభర్తయేవచ్చినయెడల నీవు నాకడకి రావద్దు. నీదారి నీవు చూచుకొనుము. మీరైన పనిచేసావులే! ఈమాట నాకోటిఁజెప్పనియెడల నాకొంప తీసావన్నమాటే ?

ప్రిభా—ప్రియుడా! నిన్ను నమ్మియున్న నన్నిటుల జూచుట న్యాయమావునా? నీవే నాకు భర్తవని మదిని యెంతయో నుప్పొంగుచుంటిని.

జయపా—(తనలో) అక్కటా! ఈజారకామిని యెంతసిగ్గువిడచి యిట్లుపల్కుచున్నదోఁగదా? తుచ్ఛుడగు యీమేదరనాయకుని విడనాడలేక యెట్టి కఠినమైన మాటలైనను భరించుచుండెను. అక్కటా భగవంతుఁడు యీప్రపంచమును యీమోహామును యేల సృజియించెను.

వెంక—నీనాథుఁడు యిప్పుడెందున్నవాడు ?

ప్రిభా—నానాథుండు యింటిలో నిద్రించుచున్నవాఁడు ఆతని పరుండపెట్టి నీదగ్గిఱకు వచ్చినాను.

వెంక—అయ్యో బాబో! నాకొంపముంచావన్నమాటే నీనాథుఁడు లేత్తే కొంపమునగదు?

ప్రిభా—అందుకనే నానాథుఁడు లేవక పూర్వమే యరుదెంచెద.

వెంక—అల్లాగెందుకు పరుండపెట్టి వచ్చావు. ఒక వేళ నీనాథుఁడు లేచిన, నీవు యెందుపోయినావోయని జూచుకోడు.

ప్రిభా—అందుకనే, నన్ను త్వరగాఁ బంపుము.

వెంక—నీమొగుడు నిన్నుకూడా తీసుకొని వెళ్లడా?

ప్రిభా—నిన్ను విడనాడి యేగుదుననుకుంటివా? అట్లుయెన్నటికిఁ దలంపకుము.

వెంక—ఏమి చేసెదవు?

ప్రిభా—ఇంకొకమాటు వచ్చెదనని చెప్పెదను.

జయపా—(తనలో) అయ్యో! యీజారకామిని భర్తలేనంతకాలము వీనితో గలసి హాయిగా సుఖించుచున్నది. అవును సతులను పుట్టింట నెంతయో కాలమును నుంచ గూడదు. ఒకవేళపుట్టింట నుంచినను యందరు నిట్లే మెలగుదురా? అయ్యో ప్రాణసఖా! జయంతా నీకెట్టి దురవస్థసంభవించెనోయి?

వెంక—ఎప్పటికైనను నీవత్తవారింటికెళ్లుదువు. యింక నాకేమిలాభము. అత్తవారు నిన్ను యస్తమాను పుట్టింటనుంచెదరా? నిన్ను దీసికొని పోవుచున్నారుగదా?

ప్రిభా—అట్లయినచో నన్నేమి చేయుమనెదవు. నానాథుని చంపమనిన చంపెదను.

వెంక— అబ్బో! అబ్బో! యింకే, యింకే, అల్లాచేస్తే నేను చాలాసంతోసిస్తాను. ఆమాటంటవో లేదోయని యాలోచిస్తోను. ఎల్లాప్రాణందీస్తావు?

ప్రిభా—నానాథుడు, యిప్పుడు గాఢ నిద్రయందు వుండెదరు ఈనిశీధమున రాజభటులెవ్వరును వుండరు కావున నీవు కత్తినొసంగిన భీతియేమియు లేక ప్రాణములు హరించెదను.

వెంక—అట్లు జేసెదవా?

జయపా—(తనలో) హా! హా! ఎంతమాటాడితివే నీచురాలా? అయ్యో నామిత్రునకు యేమియాపదసంభవించునో గదా? సఖా యెంతపాపము చేసుకొంటివో గదా? ఓసీ చెండాలా?

మ. కులటా యేమసి ప్రేలినావుమదిలో నీ కూరరాత్మునిన్ గూడగా
తులువా యెంచితె భీతిలేక పతినిన్ నీ దుర్మించంగ నీవిట్టి యీ
కులటన్ గూడుచును టివయ్యోయిది నీ నీ కున్ భావ్యమా నే మదిన్
గలలోనైనను మిమ్ము నేను మదిలో నీ గార్పణ్యమున్ దీర్చెదన్.

(మేదరి నుద్దేశించి) ఓరీ దురాత్మా, యెంత యాలోచన గల్గితివిరా? నీచ కులంబున పుట్టి రాచకులంబున బుట్టినయింతిని గూడుచు మదిలో భీతి యేమియు లేక మెలఁగుచుంటివా? ఔరా యెంత మోసమాలోచించి తివి? పాపము యెప్పటికైనను బయలుపడక మానకఁబోదులే?

ఉ. క్రూరా యేమని పేలినావు మదిలోఁ ॥ గొంకేమియున్ లేకయా
మారాకారు వధింప నెంచి మది సౌ ॥ భాగ్యంబుగా నుండి యీ
నారీరత్నము కూడగాదలచియు ॥ న్యాయంబు గావించితే
ఔరా యెంతటి మోసగాడవుర భా ॥ వ్యంబౌనె నీకిట్టులన్

అకటా యీస్త్రీ యెందుకు యీధారుణియందు జన్మించెనోఁగదా? ఆహా?

తే. గీ. ఎంతకైననుతగుదురే! ॥ యింతులిట్లు
కాంతుఁగొంతునుగోయగా ॥ సుంతయిపుడు
పోవుచున్నది యింటికిఁ ॥ బోగరుమొక్క
కొమ్మలిప్పుడు ధారుణీ ॥ నమ్మరాదు.

మరియు

తే. గీ. మేదరిట్టులగూడుచు ॥ మేలుగాను
సంగతంతయు చెప్పుచు ॥ సరసునెంతో
పొగడుచుండెను యిప్పుడీ ॥ పోగరుబోతు
జారులెప్పుడు మానరు ॥ సందుయున్న

(ఇంచుకయూరకుండి) ఆహా! కలికాలమున యెన్ని చిత్రములుగలవోఁగదా? అయ్యో యెన్ని దురన్యాయములుఁ గలుగుచుండెనోఁగదా. ఎక్కడజూచినను పాపములేఁగదా గౌరాభిమానములు యడుగంటినవి దుర్మార్గులు ప్రబలినారు దురన్యాయములు వృద్ధిచెందినవి. ఎందుజూచినను పాపులేఁగదా. సజ్జనులను పాడుజేయు దుర్జనులు జన్మించి [illegible]

దొంగసాక్షికములిచ్చుట, యితరుల ధనమునపహరించుట, యొకరిని బాధించుట మిక్కిలి యన్యాయముగా వృద్ధినొందెను. జారత్వము, చోరత్వము మిక్కిలి పెరుగుచున్నవి. ఎందుగాంచినను జారులేగదా? యేరాత్రిపరీక్షించినను చోరులేగదా? పతిసేవ విడనాడు భామామణులు కడుప్రబలినారు. కలికాలమును సమర్థించెడువారు చాలామంది వెలసినారు. జారిణీవృత్తిజేయుస్త్రీలు మందలుమందలుగా జనించినారు. అట్టివృత్తినవలంబించి భర్తను జంపుటకు కూడా సిద్ధపడిన యీకాంతను నేడు నాకన్నులారా గాంచితినిగదా! అట్టి యీమాయాప్రపంచమున భగవంతుడు నన్నేల పుట్టించెను. దైవకృపయెట్లున్నదోగదా? ఇవియన్నియు కాలానుకూలమును బట్టి జరుగుచున్నవి.

ప్రభా — మేదరి నాయనా! జాగేల చేసెదవు. ఆలోచింపక యీపాటికి కత్తి నొసంగుము.

వెంక — (కత్తి నిచ్చి) ప్రభావతీ! యిల్లా నూడు! ఈకత్తి తీసుకొని వెను కొన్నావు మరి నీవీతని యెల్లా నెరవేరుస్తావో గదా? నాకుఁ జాలా భయంగానున్నది. నీమగని యెట్లు చంపెదవోఁగదా? యెవరికిఁ దెలవకుండా చంపాలి సుమా! అల్లాచేస్తావా, మన యిద్దరము మనయిచ్చవచ్చినట్లు వుండవచ్చును.

ప్రభా — అతినేర్పుగా నీపనిగావించెద! (నిష్క్రమించును)

వెంక — (నిష్క్రమించును)

జయపా — (స్వగతము) అయ్యో యిప్పుడీమె తప్పక నాప్రాణమిత్రుని యీకరాసిచే చంపును. అకటా! నిష్కారణముగా నాప్రాణమిత్రుడీమె చేతిలో మడియవలసినదేనా? ఇందుకు నేనేమి చేయువాడను.

తే. గీ. అకట ప్రాణమిత్రునిఁ జంప నీ సదయుచుండె
నట్టియీమెను వారించి నీ మాత్మయందు

ప్రాణములుగాచి బ్రోచెద ప్రాణసఖుని
కనుక నేగెదనింటికి వెనుకగాను

కావున నామిత్రుని యీగొప్ప యాపదనుండి తొలగించవలెను. అకటకటా యానాడు యామాయవేశ్య నన్ను పిలచి నాప్రాణమిత్రునకును నాకును విరోధము పెట్టినప్పటినుంచి యీనాటివరకు యిట్టి కష్టములు గలుగుచుండెను గదా? అయ్యో దైవమా యీదురవస్థ నేల తెచ్చి పెట్టితివి. (నిష్క్రమించును)

(ప్రభావతి సౌధము)

(జయంతుఁడు పరుండును.)

ప్రభావతి—(ప్రవేశించి) ఇప్పుడు నాకార్యము నెరవేర్చుకొనవచ్చును. అందఱు నిద్రావస్థలో నున్నారు. ఇది నిశిరేయిగదా? రాజభటులందఱు నిద్రించుచుండెదరు. చుట్టుపక్కల నెవ్వరును లేరుగదా! (అన్నివైపుల జూచి) ఎవరును లేరు. నాకోరిక నెరవేర్చుకొనవచ్చును. నేను హాయిగా మేదరినాయకునిఁగూడి నాసంతోషముఁ దీర్చుకొందును. (జయంతుని సమీపించి) ఆహా! ఇప్పుడీతఁడు నాచేతిలో మడియవలెను కదా? ఈతఁడు మరణించిన వెనుక నన్నుఁ జేరదీయువారెవ్వరు? అయ్యో నాకు విధవరికము సంభవించుచున్నది గదా? నీవితంతువైన యొరులఁగంట బడిన నిందించరా! అదియుఁగాక నాతల్లిదండ్రులు నన్ను వీధిలోనికిఁ పోనిచ్చెదరా! ఒకవేళ నీరహస్యము ప్రపంచములోఁ దెలిసిన యపకీర్తి వచ్చునుగదా? ఎప్పటికైనను యీసంగతి వెల్లడవకుండా దాగియుండునా? పాపమెప్పుడో యొకసారి బ్రద్దలవక మానదు. కావున యీకార్యము చేయకుండుటయే మంచిపని. నన్ను యందఱు దూషింపరా? (ఆలోచించి) ఇప్పుడీకార్యము గావించుట మానితినా, మేదరి నాయకునికిఁ యాగ్రహము గలుగక మానదు. అప్పుడాతని స్నేహము భంగముగలుగును. అతనిని

వీడి తృటికాలమైనను యొంటరిగా సైపజాలను. మేదరినాయకునికడ నేను తప్పక నాభర్తనుఁ జంపి వచ్చెదనని వాగ్దానముచేసి యుంటిని గదా? అందుచేఁ దప్పకఁ జంపి తీరవలెను. అదియుఁగాక మేమిద్దరము చిన్నతనమునుండి యెంతయో యన్యోన్యరాగముతో మెలఁగితిమి. మేదరినాయకుని మాటనట్లు తీసివేసెదను (కత్తి నెత్తి) ఆహా! నేను భరింపజాలను. నాశరీరమంతయుఁ గంపమెత్తుచున్నది. హృదయంబున ధైర్యమాగుటలేదు అయ్యో యగ్నిసాక్షిగ పెండ్లియాడిన భర్తనెట్లు చంపగలను. అకటా! ఇదంతయు జారత్వమువల్లఁ సంభవించుచున్నది. అయినను వెనుకటిగాథ త్రివ్వనేల (ఇంచుక యూరకుండి) అక్కటా? ఎంతటి పాపకార్య మాచరించుచుంటినోగదా? ప్రాణనాయకుని చేతులారా చంపుచుంటిని. ఇంక నాలోచింప వలసిన పనిలేదు. చంపుటయే యుక్తమైనపని. లేనియెడల నామరణముఁ జనుగును యెంతటి ముప్పు వాటిల్లినను సరే యీతని ప్రాణములు తప్పకఁ దీసెదను.
(జయంతుని కంఠము నరికివేయును.)

జయపా—(తొందరగా ప్రవేశించి)

మ. అరరే యెంతటి మోసమారా! పతి నన్యాయంబుగా జంపగా
కరవాలంబునుఁబట్టి నీవు మదిలోఁ గార్పణ్యమున్ దీర్చుచున్
బరకాంతామణి వైతి మేదరికుల ప్రావిర్భవున్ గూడితే
వరునిన్ జంపకు జంపకయ్యొ నినునే ప్రార్థించెదన్ రత్నమా?

చీ! కుటిలాత్మ యాడుదానవై నీవీకార్యముఁ గావించుచుంటివా? మదిలో నేమియు యాలోచింపక యాపాపాత్ముని మేదరినిఁ గూడి నీభర్తను చంపుచుంటివా?

ప్రభా—(జయపాలునిఁ గాంచి)

తే. గీ. ఎటుల జొచ్చితి సౌధము భటులుయుండ
క్రూరుడైతివి వాధునిఁ జేరినీవు

ప్రాణములు దీసితివి తోరి పాపకార్య
చెప్పెదను భటులకును నే నిప్పుగాను

జయపా—ఓసి! నీమారాకారుని వధింపవచ్చునా? నీచకులంబున జన్మించిన మేదరిఁగూడి భర్తను చంపుచుంటివా! రాజవంశమున జన్మించి యీతుచ్ఛపురుషులు గావింపవచ్చునా? కావున చంపుచున్న నీభర్తను రక్షించుటకు యీసాహసమునకు వచ్చినాఁడను.

తే గీ మదిని నెంచక యీపిట్లు మాయగాను
చంపుచుంటివి భర్తను జారవైతి
నిన్ను జూచిన పాపము నీచురాల
బట్టియిచ్చెద రాజుకు పడతి నిన్ను

(చచ్చియున్న జయంతునిగాంచి) నీచురాలా! నేను నాకమున్న ప్రాణమిత్రుని జయంతుని వధించితివా? అయ్యో మిత్రమా నీకీదురవస్థ సంభవించునని కలనైనను దలపలేను ఈదురవస్థలు నీచకులటవలనే గదా సంభవించెను. అకటా నామిత్రునకు నిట్టి దురవస్థ సంభవించునని కలనైనను జరుగునని వినియుండలేను. ఓసీ! చండాలీ యీఘోర కృత్యము నేలకట్టుకొంటివి నీచకులుఁడగు మేదరినిఁ గూడి సౌఖ్యములు పొందదలచి నీవీకార్య మాచరించితివా? నీవీ పనిచేయునంత నెవరును గాంచరని నీమనంబున దలచితివా? దైవము సర్వవ్యాపకుండని యెరుంగవా! పంచభూతములు సాక్షియని యెరుఁగవా? సూర్య చంద్రాదులు లేరనుకొంటివా? ఓసీ! పాపాత్మురాలా! తుచ్ఛంబగు యిహలోక సుఖముల కాసించి అగ్నిసాక్షిగ వివాహమాడిన భర్తను మానీచుఁడగు మేదరి మాయలోఁబడి ప్రాణమును దీసితివా? ఈపాపంబు యెన్ని జన్మములకైననుఁ బోవునా? ఇట్టి మహాపాపములాచరించిన వారినిఁ బట్టి దండించువాఁడు కాలుఁడొకఁడున్నాఁడని యెరుఁగవా? అయ్యో! ప్రాణనాయకునిఁ జంపుటకు నీచేతు లెట్లు

వచ్చునోగదా? అవును మోహము యెంతటి పనినైనను చేయించును. నీచకులంబున పుట్టుటకు మారుగా నీవు రాజవంశమున జన్మించినావు. అకటా! ప్రాణనాథుని ప్రాణములు దీసిన నిన్ను యీసమయమున బట్టి చంపినను పాపముండునా? నీకీకోశమునను జాలిలేదే రాజకులమున జన్మించి యీనీచపు కార్యమును గావించుటకు నీకెట్లు చేతులొచ్చెనే?

అయ్యో! మిత్రమా! నీభార్యచేతిలో మడిసినావా? అకటా! ఆనాడు మనమిద్దరము వేశ్యవల్ల విడఁబడిన దాదిగా యీదురవస్థలే సంభవించుచుండెగదా? ఆహా! మిత్రమా! మఁస్నేహభంగమేకదా యీదుఃఖాబ్ధిలోఁ బడవైచినది ఆనాడు నేనెంత బ్రతిమాలుకొనినను నామాటవినక నిస్సారించి యనరాని దుర్భాషలుయాడి నామైత్రి వీడితివిగదా? అయ్యో యప్పటినుండియే కదా యీయిక్కట్లు సంభవించినవి. నాగతికి నేమాశ వగుతును నిప్పు లేదే నే జీవించుటెట్లు. నాకేమని విన్నవించెదను దైవమా మమ్ము యీరీతిగా నుంచుట న్యాయమా? నీవీనట్లలను యేల యీధారుణి నుంచెదవు అకటా నేనింక నైనను, నైనను. నాహితుడు లేనప్పుడు నేనేల యీభూమియందు బ్రతుకవలెను.

తే. గీ. ప్రాణమిత్రుడు నశియించె బాయునపుడు
బ్రతుకజాలను ధారుణి పరమపురుష
లోకములు బ్రోచుతండ్రివి లోకకర్త
వట్టినను నీవుగొనిపొమ్ము యెట్టులైన.

కాన యోదైవమా? నేనును, పరమపాపి నైతిని. నావంటి దుర్మార్గులు బ్రతుకుట హేయము నీచమేకాక నీలోకమున మెలంగి నీసజ్జనులకు కూడ హానిగలుగును. నన్నేల బ్రతికించెదవు. "పాపీచిరాయు" అను మాట సమర్థింపకుము. కావున నన్ను గొనిపొమ్ము.

ప్రిభా—(తనలో) ఈతఁడెవ్వఁడో తెలియకుండెను. ఎవ్వరైన నేమి. ఇట్లు యూరకుండినఁ దప్పక ముప్పువాటిల్లును. కావున నొక మంత్రము పన్నెదను. (ప్రకాశముగా) ఓ! రాజభటులారా! యీనిశీథమున యెవ్వఁడో యొక దుర్మార్గుఁడు భీతిలేక నాసౌధమునకుఁ జొచ్చి నాబాధుని చంపినాడు. రండు. రండు. నన్ను రక్షింపుడు.

(అని బిగ్గరగా కేకలిడును)

(యిద్దఱు రాజభటులు ప్రవేశించెదరు.)

రాజభటులు—(ప్రవేశించి) ఏడీ! ఆదుర్మార్గుడు.

ప్రిభా—అతఁడే! పట్టుకొండు. పట్టుకొండు.

జయపా—(తనలో) ఆహా! కాలమెంత తలక్రిందులుగా మారెను. కాంత లెంతకైననుఁ దగుదురు అక్కటా యీమె యిందుండి తప్పించుకొనుటకు యెంత మంత్రనము బన్నెనోఁ గదా? ఆడువారికి నెంత యాలోచనైనను యాలోచింపకుండనే మనంబున దట్టును. తాను యీఘోరకృత్యము యాచరించుటయే కాక యిందుండి తప్పించుకొనుటకు యీదురాలోచనము పన్ని నది. ఎన్ని యవస్థలు సంభవింపఁ దలచినవోయన్నియు సంభవించుచున్నవి. అక్కటా యిదంతయు కాలానుకూలము గదా? ఇందుకు నేను చింతింపనుగాని నామిత్రుండు నిష్కారణముగా చనిపోయినందుకు విచారపడుచున్నాను.

(భటులు జయపాలునికి సంకెళ్ళు వేయుదురు.)

రాజభటు—ఓరీ! క్రూరా యాలోచించెదవేల? నిన్ను మేమిప్పుడు కారాగృహమునకుఁ దోడుకొని పోవుదుము రమ్ము? (జయపాలునిఁ గారాగృహమునకుఁ దోడుకొని పోవుదురు)

పరిభా—ఆహా! నాకార్యము చక్కగా నెరవేరినది. ఇప్పటికిఁ గదా
నాహృదయము చల్లబడినది. నేనెంత యదృష్టవంతురాలను.
నన్నుబోలు కాంతలు యీలోకమున గలరే? కష్టకాల
మంతయు చిటికలో తప్పించుకొంటిని, యేమంతనము బన్ని
నను స్త్రీలు నెరవేగుదురు కాని పురుషులు గెలువజాలరు.
నేనిప్పుడు నాప్రాణనాయకుఁడగు మేదరినిఁ గూడి హాయిగా
సంచరింప వచ్చును. నన్ను యిఁక యే యాటంకము చేయువారు
గలరా? (నిష్క్రమించును)

(మోహిని ప్రవేశించును) ఆహా! వారు రాజుగారు మంచి బహుమతి నొసంగినారు. నేను రాజమంత్రి కుమారుల స్నేహము విడదీసి యుంటినిగదా? ఆనాడు యీయుద్యానవనములో రాజకుమారుఁడు నన్ను గాంచి మోహావేశమున బడియున్నవాడు గదా? దాని మూలముననే వారిమైత్రికి భంగము కలిగినది. అందుచే నేబోయి రాజకుమారునకు గనబడితినా? నన్ను తప్పక మోహించును నాకు ధనము చాల లభించును. (వీరసేనుడు ప్రవేశించును)

వీర—ఎవరు? యీసౌధములో నున్నవారు? ఏమి కార్యముచేత నిట్లు యరుదెంచితివి.

మోహి—అయ్యా! నేను వేశ్యను, మీనాయనగారు బహుమతి యిచ్చెదరని చెప్పగా నిట్లువచ్చినాను.

వీర—ఇచ్చినారా?

మోహి—ఆ! ఇచ్చినారు.

వీర—అట్లయిన ఇంకను యిక్కడ నెందుకాగితివి. దుష్కార్యము జేయుచుంటివా?

మోహి—సౌధములోనుంచి వచ్చుచుండగా మీరు కానబడితిరి.

వీర—యిక్కడ నుండరాదు. వేగముపొమ్ము.

(నిష్క్రమించును)

రెండవ యంకము సమాప్తము.



శ్రీ

# జయంతజయపాలము.



## తృతీయాంకము.

(కారాగృహము)

జయపా.—(తనలో) కటకటా! తుదకు నాయవస్థ యీరీతిగా పరిణమించుచున్నదా? హా! దైవమా, నన్నిరట్టుల పాలుయేల గావించితివి. నేనేమైనను దోషములాచరించి యుంటినా? (ఆలోచించి) అవును. కాలమంతయు నొకరీతిగా గడవబోదు.

మ. స్థిరమైసంపదలెల్ల వెంటనొకరీ తిన్ సాగిరావేరికిన్
నరుకేపాటు విధించెనో మదినినా నాకష్టముల్ జెందియూ
ధరాపాలంబగురాష్ట్రమున్ మెలగగ గర్వంబేరికిన్ గూడదో
చెరసాలన్ బడవైచిపోయెవిధినా శ్రీయుంబుయెవ్వారికో?

అకటకటా! నరులందఱు విధికృత ప్రకారము చరింపవలెను గదా? యేనాడు యేగతి సంభవించునో దెలియదుగదా? ఆనాడు మిత్రుడు నేనును యెన్నియో సుఖములు పొంది యీనాడు యీయవస్థలపాలైతిమిగదా! దైవమా! నీకు నాయందు యేల దయలేదు! నాయందు యేమైనను లోపాలోపంబులు గలవా? కరుణాపయోనిధి నన్నేలంగాపాడవు.

మ. పరవిత్తంబును బొందలేనుమదిలో బాపంబునన్ మొగ్గనో
నరభూపాలకుఁ బట్టియిచ్చితిననున్ న్యాయంబె నీకిట్టులన్

కరుణావార్ధివి కావు నన్నుమదిలోఁ గారుణ్యమున్ వీడినీ
చరణాబ్జంబులు నమ్మినవాఁడననుచే చందంబునన్ బ్రోచెదో?

అయ్యో దైవమా? అట్టినన్ను న్యాయంబుగా నుంచుట న్యాయంబుగాదు. నా మిత్రుఁడు లేనిదే నన్ను పాడుభూమికి నుంచుట నాకేమిలాభము. అవును. ఏనాడు పాపము లాచరించితినో యానాడు యిట్టి కారాగృహంబునఁ బడి మీఁదటవోలె మాడుచుంటిని. పాపములు సేయువారికిఁ నరకంబు లేదా? అట్టిరీతిగానే నాకీ కారాగృహమే నరకము. చివరకు నరకప్రాప్తి జెందితినా? అపునాతుచ్ఛురాలు వేశ్యమాట వినుటకు నెప్పుడు పోతినో యప్పుడే నరకప్రాప్తి జెందితిని. అయ్యో! యిప్పుడేమనివగతును. ఈకారాగృహప్రాప్తికి విచారించనుగాని, నిష్కారణముగా నా హితోత్తముఁడు అబల చేతఁజిక్కి మడిసి స్వర్గప్రాప్తి జెందినందుకు దుఃఖించుచున్నాఁడను. మిత్రమా! నీవెట్టి పాపమాచరించితివోగదా? అట్టి నిచురాల భర్తవైతివి. ఎప్పటికైనను నిజము లుకడమీద తెలియక మానదులే, ఆసర్వవ్యాపకుఁడు లేడా? ఓసీక్రూరురాలా! నీనాధుఁ నివు కరవాలము పూని కుసుమశరీరు జయంతుని యెట్లుఁజంపితివే? నీకుచేతులెట్లువచ్చెనే? అవును హేయమగు మేదరి నెప్పుడుగూడితివో యప్పుడే మోహాబ్ధిలో బడి మునిగి యిహలోక సౌఖ్యముల కాసపడి యటుగావించితివి. మిత్రమా నామాటలు పాటింపకపోతివికదా? అకటా! నామిత్రుఁడు లేనిదే నాప్రాణము లేల. నేను మాత్రము భూమిమీఁద నేల చరింపవలెను. అయ్యో! యీయమశిక్ష నాకెప్పుడు ప్రాప్తించి నన్ను పరలోకమునకుఁ గొంపోవునోగదా యట్లుగాకున్న యో పంచభూతములారా నన్ను హరింపుఁడు? నావంటి తుచ్ఛుఁడును యీలోకమున వసించితినేని మీకు గూడా హాని గలుగగలదు. అయ్యో! నామాటలెవ్వరు నాలింపరేమి? మిత్రమా యెంత

యన్యోన్యరాగముతో నుంటిమో యంతకష్టము జెందుచుంటిమి అహా! పూర్వపుసంగతి తలుచుకొన్న గుండె నీరగుచున్నదే?

ఉ. చిన్నతనంబునుండి నను । జేరగదీసికుమారురీతిగా
మన్ననతోడ బెంచిపిత । మంత్రిపదంబున నుంచినట్టివా
కన్నసఖుండవీగతిని । కాలుని పాలనజొచ్చియుండనీ
సన్నిధి నుంటనోచుకొన । జాలని నేయవివేకుడన్ గదా ?

కాన మిత్రమా నీకై యేమని పరితపించెదను?

వీరసేనుడు— (ప్రవేశించి) అయ్యో! నిన్నరాత్రి యెవ్వరోసన్యాసి జయంతకుమారుని చంపెనని కారాగృహమున బడవైచిరి గదా? అతని గతియేమయ్యెనో దెలియుటను లేదు. సన్యాసి యట్టి కార్యము గావించునా? మాతండ్రిగారు విచారణ చేయక పూర్వము యిందలి నిజస్థితిని దెలుసుకొనవలెను. కాని యిదంతయు మాయగానున్నది (ఆలోచించి) ఆసన్యాసియేమి? అర్ధరాత్రి భీతిలేక రాజసౌధము జొచ్చి యింతఘోరకార్యమాచరించియుండునా? కావున యిందలి నిజము తెలిసికొనెదను. (సన్యాసిని సమీపించి ప్రకాశముగా)

శా. కట్టా యెవ్వడవోయి నీవు మదిలో । గారాగృహంబున్ భువిన్
నట్టేటంబడి యేడ్చుచుంటివి, నినున్ । న్యాయంబుగా జూచెదన్
బట్టిండన్నము పెట్టెదన్ వినుమునీ । భావంబునన్ దెల్పుమో
యెట్టోయట్టుల దెల్పుమయ్యవధనున్ । యెవ్వండుగావించెనో?

మరియు నీరూపము చూడగా మునిరూపముగలిగియుంటివి అట్టినీవు యీవధను గావించితివా? చెప్పినను నేనమ్మజాలను. ఇందునిజము వక్కాణింపుము.

జయపా—అయ్యా మీరు చెప్పినట్లు నేను మునికుమారుడను. విధివశంబున నాకీదురవస్థ సంభవించెను. నాకు చెప్పుటకు నోరాడకు

న్నది, నాక్షేమము కనుగొన నరుదెంచిన మీరెవ్వరో చెప్పి శ్రవణానందము చేయుడు. నాకీ యవస్థ సంభవించుట నాకేమియు విచారములేదు. ఏలయంటిరా!

తే. గీ. కలిగెనాకిట్టిదురవస్థ కర్మవశము
చేతవినుము వచించెద హితముగాను
క్రూరహత్యనుచేసితి కుటిలనైతి
కానపడియుంటి నిందునే కర్తనైతి

అందుచే రాజగారియాజ్ఞ ప్రకారమునిందు నన్ను బడవైచిరి కావున నేను మహాపాపుడను హత్యగావించిన వానిని భూమిలోనుంచ కూడదు.

వీర — నీవు నిజముగా జయంతుని వధించినావా ?

జయపా — ఆ! అయ్యా! భవదీయనామంబెద్దియో తెలిపి నన్నానందపరచ దరా?

వీర — ఓయీ నాపేరువీరసేనుఁడు. ఇప్పట్టణంబునేలు భూపతికి కుమారుడను. నీవు సన్యాసివైయీకార్యమాచరించెదవా? యని సందేహాపడి యిదెంతనిజమో తెలిసికొనుటకు నరుదెంచినాడను.

జయపా — రాజకుమారా? నేను చంపియుంటిని గనుకే నన్నీ కారాగృహమున బడవైచినారు.

వీర — నిజముచెప్పు. ఏలబొంకెదవు నీవేషముచూడ సన్యాసివలెను, ముఖారవిందము రాజకుమారుని బోలియున్నది. మునివేషము యెందుకు ధరించితివి నీస్వాంతమున భీతిజెందవద్దు.

జయపా — అయ్యో! ఇదంతయు మీకెందుకు?

వీర — జయంతకుమారుని యెవ్వరువధించిరో తెలిసికొనవలెనని కుతూహాల పడుచున్నాను.

జయపా—మీారు నన్ను పదిసార్లు యడుగనేల ? యీావధగావించినది నేనే.

వీర—నీవువచించిన వాక్యము నేనమ్మజాలను ఇదంతయు యేదో వింతయగు మాయతో నిండి యున్నది. కావున నాయందు దయగల్గి నిజము తెల్పుము.

జయపా—జరిగి పోయిన సంగతు లేల బయలు చేసెదరు? అవి యున్నియు వచింప వలసిన విషయములుగావు.

వీర—ఏమియు యెరుగని నిన్ను నిందవైచినందుకు నాకు చాలావిచారముగా నున్నది. అందుచే నీవు మనస్సునందు భీతిలేక వచింపవలయును. నీకు నేను మేలు గావించెదను.

జయపా—జయంతుని నే చంపలేదని దోచుచున్నదా!

వీర—ముమ్మాటికి నాకు దోచినది.

జయపా—అయ్యో! యీగొడవ నానోటినుంచి రాదే?

వీర—నామాటవినవా? నాయందుదయగల్గవా?

జయపా—వీరసేనా' నామాటవినుము. ఈసంగతి తెలిసికొనుటకు చాలా కాలము పట్టును. కావున నీవు యీారేయి నావెంట వచ్చితివా? నీకీకథయంతయు పూసగ్రుచ్చినట్లు విన్నవించెద. అదియుగాక నీకద్వారా గూడ గాంచవచ్చును. నీకీవధ యెవరు చేసెదరని యనుమానముతట్టుచున్నది?

వీర—ఆడువారు యెంతకైనను సాహసులు. అందుచే యీాహత్య యీాడువారి వలన జరిగి యుండును!

జయపా—అట్లయిన పోవుదమా?

వీర—రమ్ము తాళము దీసెదను (తీయును)

(నిష్క్రమించిరి)

రంగము:—ప్రభావతి సౌధము

[వీరసేనుడు జయపాలుడు ప్రవేశము]

వీర—నన్నిక్కడకు దీసికొని వచ్చితివేల? ఇది మా ప్రభావతిసౌధమే! ఇదంతయు నాకు మాయగా నున్నది.

జయపా—రాజకుమారా! జరిగిననాటకమంతయు నిష్ఫలముననే యున్నది. అదియంతయు నిందునుండి గాంచెదవే. నాయిష్టాను సారముగా నీవు చరింపవలెను. సమస్తము నీకుఁ దెలియును. మన మీయరుగుల మీద పరుండి పిమ్మట నేమగునో వీక్షించెదము.

వీర—అట్లే నీవు చెప్పినట్లు గావించెదను. (అరుగుమీద పరుండిరి)

(అంతతలుపు చప్పుడు వినవచ్చును)

వీర—ఓయీ! యిక్కడ తలుపుచప్పుడు వినవచ్చుచున్నది. మన నెవ్వరును యానవాలు పట్టరుగదా.

జయపా—వీరసేనా! ఎవ్వరు యానవాలు పట్టరు. నీవు మాత్రము మాట్లాడవద్దు మాటలాడిన కొంపమునుగును. మనము పన్నినకన్నుగడచెదను!

ప్రభావతి—(తలుపుదీసికొని) ఆహా! నేను యింక మేదరి గృహంబునకు హాయిగాఁ బోవచ్చును. నేను త్వరగా నాపని నెరవేర్చుకొని మరలి రావలెను. (నడచుచున్నది)

వీర—(జయపాలునితో) ఏమీ! యిది నాకు చాలా యాశ్చర్యమగుచున్నది. ఈమె నాసోదరి ప్రభావతి కదా! ఈయర్ధరాత్రి యెక్కడ కేగుచున్నది? కనుగొందునా?

జయపా—(రహస్యముగా) నీవేమియు చేయరాదు. నేనిదివరకు చెప్పి యుంటినిగదా? అట్లేమైన చేసితివేని మనకుం గార్యభంగము గలుగును.

వీర—నేనేమియు మాట్లాడను నీయిచ్ఛ వచ్చినట్లు గావించెదను.

జయపా—మనమిప్పుడు రహస్యముగా నీమె వెనువెంట నేగవలెను. నీవు కలికాల చర్యలన్నియు గాంచుచుందువు.

వీర—అయ్యో! ముందునేమిజరుగునో గదా?

జయపా—నీవే నీకనులారా గాంచెదవు.

(ఇద్దఱు ప్రభావతి వెనుకం బోవుదురు)

వీర—అయ్యో! మిత్రమా! నాకేమియు తోచకున్నది నేను చింతా డోలాయమాన మానసుడనైతిని. నాసోదరి నిర్భీతిగ యీయర్ధరాత్రమున నొంటరిగా నింతదూర మరుదెంచినది. ఇప్పుడు మేదరిపేట ప్రవేశించినాము నాసోదరిందు యేమిపనియుండి వచ్చుచున్నది. ఆహా! కాలమహిమగదా! మిత్రమా! ఇప్పుడీమెను నాకరవాలమున గూల్చెదనా? ఇటువంటివారు బ్రతికిన నేమి చచ్చిననేమి?

జయపా—అదియేకదా నేవలదని చెప్పితిని. అట్లయిన నే వెనుకకుం బోయెదను. నీవిచ్చట యిచ్చవచ్చినట్లు యుండుము. నేను పోయెదను.

వీర—మిత్రమా! వలదు. వలదు. నేనేమియు మాట్లాడనులే. నీయిష్టానుసారము మెలంగెద.

[తె ర లే చు ను]

మేదరిగృహము

జయపా—మిత్రమా? ఇందు నివు పరిశీలించి చూచుము.

వీర—ఇదేమివింత మిత్రమా? ఆహా! నాస హోదరి సిగ్గు విడనాడి మేదరిగృహము జొచ్చుచున్నదేమి? ఆహా! ఏమి యాసీచు రాలు, యింతకాఠిన్యము గావించుచున్నది. అయ్యో! నేను చిన్నతనం బునుండి యెంతయో ననురాగముతోఁ జూచితినే! అట్టియామె యా నిందలపాలు జొచ్చెనా? మిత్రమా? నాకు గోప మాగకున్నది. నా కరవాలంబున యామెశిరము ఖండింపనా?

జయపా—అయ్యో వీరసేనా! నీకెన్నిమారులు యిట్లు పలుక వద్దని చెప్పను. మాటిమాటికి నిట్లు పలికెద నని చెప్పిన రాకుందునే?

వీర—ఓయీ! సఖుఁడా!

తే. గీ. జననమొందెను క్షత్రియ జాతియందు
ధాత్రివిభుఁడగునాతండ్రి పుత్రియామె
కులటయై యామె మేదరిఁ గూడుచుండ
చూచి యోర్వఁగలనె! నేను కటిచర్య.

మరియు

తే. గీ. స్త్రీనిజంపిన పాపము చెందనిమ్ము
ప్రజలు నీకిదిగూడదను భావమందు
యనిన యననిమ్ము నేనింక నాగలేను
చంపుచున్నాను నీమెను సఖుఁడనేను.

మిత్రమా! నన్ను మాబాయనగారు దూషించినను సరే నేనీమెను చంపెదను. ఆహా! స్త్రీల మాయను గనుఁగొనుటకు నెవ్వరి తరము. యీ కాలమున స్త్రీలట్లు చేయుచున్నారు.

తే. గీ. పతినివిడనాడి విటకాండ్రి ¦ పక్కఁజేరి
పైకి శ్రీరంగనీతులు ¦ పలుకుచుండె
మోసమెంతయుఁజేయుచు ¦ భూమియందు
ప్రబలుచుండిరి యీరీతి ¦ పాడుసతులు.

అక్కటా! దైవమా కాలమంతయు నిరీతిగా మార్చితివా? ఛీ! ఛీ! యీపాడుకాంతలు యనేక పాపపనులఁ జేయుచు సర్వబంధువులకు యపకీర్తిఁ దెచ్చుచుండిరిగదా? అయ్యో దైవమా! యీనీచపుజాతి నేల ప్రబలించెదవు, అకటా! యీ చెడుగుల నేల భూమినుంచెదవు. అయ్యో ప్రపంచమంతయు యీరీతిగా మారిపోయెనా? భారతభూమికి యిట్టిదురవస్థ నేల కలిగించితివయ్యా. అగ్నులారా! వీరిని దహింపుడు, భూమ్యాకాశములారా! యీజారసంఘము మీరు యేకమై యణచివేయుడు. వీరు యీభూమిని బ్రతికిన నేమి లాభము? ఉన్నవారికిఁగూడా యపకీర్తిగలుగుచున్నదిగదా?

తే. గీ. చెడిరి కులకాంతలిట్లుచు ¦ చెడిరి చెడిరి
మాయవేషము వేయుచు ¦ భావమందు
పొదుగుచున్నారు వీరిట్లు ¦ భూమియందు
జారచోరసంఘంబులు ¦ చేరియుండె.

హా విధీ! కాలమంతయు యీరీతిగా పరిణమించుచున్నదా? ఈరాజవంశమున యీతుచ్ఛురాలి నేల గల్పించితివి. పండువంటికులంబును పాడుచేయుచుండెనుగదా? మాకేల యీనీచురాలు సంభవించెనోయి?

తే. గీ. కలరు జెష్టలు భ్రష్టులు ¦ కాలమందు
మెలఁగుచున్నారు భూమిని? మేలుగాను
మంచివారిని వీరిట్లు ¦ పాడుజేసి
కాలమంతయు నీరీతి ¦ గడుపుచుండె.

ఆహా! మిత్రమా! ఇప్పుడేమందువు?

జయ. పా—వీరసేనా! నీవేమియు చేయవద్దు నాయిచ్ఛానుసారముగా నుండవలెను. ఏమాత్రము మాటలాడినా మన కార్యమునకు భంగము కలుగును.

వీర—అట్లయినను నేమిచేయమందువు. నాకేమియు బోధపడుటలేదు. అయ్యో యీచర్యచూచినప్పటినుంచియు నామనంబున నేదియో గుందుచున్నది.

జయపా—నీవు మాటాడక జరిగేసంగతులన్ని యువీక్షించుచుండు.

[ప్రభావతి, మేదరివెంకడు ప్రవేశించుచున్నారు]

ప్రభా—మేదరినాయకా! నీకోరిక నెరవేర్చవచ్చితిని.

వెం—ఇంకేం యింకేం ఏంటీ, యీపనిచేసావు సంపేశావా? యేరు సూడలేదుకదా?

ప్రభా—అందుకు యేమీ సంశయము లేదు. కాని యెవరో జనసిదగ్గిఅనుంచి ఖడ్గము తీసికొనివెళ్ళి నాప్రాణనాయకుని చంపుచుండ యెక్కడనుండియో యొకసన్యాసివేషధారుడు లోనికివచ్చి నాచేయి చంపవద్దని పట్టుకొన్నాడు.

వెం—అంబాబో కొంపముంచావా యేమిటి ఎవరైనాపట్టుకొన్నారా యేమిటి? నిజంసెప్పు? నన్ను సంపకు.

ప్రభా—అంతావినుమరి? వాడు వచ్చి పట్టుకోగానే రాజభటులనుపిలిచి యీతుచ్ఛుండు నాభర్త ప్రాణముతీసి చంపినాడని కేకలిడితిని. అంత వారు యతనిని కారాగృహమునకు దోడుకొనిపోయి యందు బంధించినారు. నేను వెర్రిదాననను కొంటివా యేమిటి?

వెం—ఆ, ఏంటి యింతపని సేస్తావని నేననుకో లేదు. ఆహా! మంచిమాయలాడివైతివే అందుకే నే యీపనిని సేయుసుంటివి.

ప్రభా—మేదరినాయకా! నాయందు చాలాదయగలిగి యుండాలిసుమా, పెండ్లియాడిన భర్తను చంపుకొంటిని యింక నీవేనాకు దిక్కు. నీయిష్టమువచ్చినట్లు నేనుంటాను

వెం—నీకేమి లోటుసేయను. మనంమాత్రం సాలాసాలా జాగరతగా నుండాలి. యేరికిఁదెలియఁగూడదు. బహుసక్కగా నీవు శేతురులు యిక్కడకు వస్తూవుండాలి. మన రాస్యం యేరికి తెలియనీయకూడదుసుమా?

ప్రభా—మేదరినాయకా! నీయిష్టప్రకారం చేస్తాలే. కాని,యీవేళ యింటికిఁ ద్వరగా పోవాలి, వెళ్లనిచ్చేదవా?

వెం—ప్రభావతీ, యిల్లాంసూడు నీభర్తన సంపావుకద, సాలాసేపుంటే యేరేమంటారు, మనకష్టం యేరులేరు.

జయపా—(వీరసేనునితో) మిత్రమా వారిసంభాషణ సావధానచిత్తుండవై యాలకింపుము. ఇప్పుడు నీకు సంగతంతయు తెలియుచున్నదా? కాలానుకూలము తెలిసినదా? జారత్వవిశేషము యర్థమైనదా? దానిసారముచూడుము. యేయేరీతిగా కాలమును మార్చుచుండునోఁగదా?

తే. గీ. ఏందలెన్నియో వచ్చును ॥ యిందువలన
పందువంటికులంబెల్ల ॥ భస్మమవును
యింటనుండదు నీరీతి ॥ యింతియెపుడు
సర్వకాలము నీరీతి ॥ సాగుచుండు.

మరియు

తే. గీ. తనువుపాడగుచుండును ॥ ధాత్రియందు
చెడ్డపేరొచ్చునీరీతి ॥ చెలియకెపుడు
పంక్తిభోజనముండదు ॥ పతికినెపుడు
పాపమెంతయొప్రాప్తించు ॥ పణతికెపుడు.

అయ్యో! వీరసేనా! జారత్వవిశేష సాంప్రదాయమిది. కాన యిటువంటివారిని భూమినినుంచకూడదు

వీ॰ సే.—అయ్యో! ఎంతదారుణ మెంతదారుణము. అకటా ప్రపంచమంతయు నీరీతిగా నుండునేమో? మిత్రమా!

తే. గీ. మదినికొంచెమైనను జాలి వదలకిట్టి
జారకాంతలుమరియింక చాలగలుప
కాలకష్టంబువదలంగ వలనుకాదు
అకట! దైవము యేరీతి నాదరించు.

మరియు సఖా!

తే. గీ. కాలమంతయు నొకరీతి గడువబోదు
జయములొచ్చును గాజుకు నయముగాను
భయములొచ్చును వెంటనే ప్రాణమిత్ర!
వింతలెన్నియొ గలుగును స్వాంతమందు.

(విచారముతో) నేనిఘోరకృత్యముచూచి బ్రతుకజాలను. ఏనాఁడు మేము పాపముచేసితిమో? యీనాఁడు యిట్టికష్టములు ప్రాప్తించెను. (ఇంచుక యూరకుండి) అయ్యో దైవమా యెంతపనిగావించితివయ్యా. మాకేలయీనీచు గాలిని గలిగించితివయ్యా. క్షత్రియాన్వయమందున జన్మించి విమలకీర్తిపరుండైన మాతండ్రి పృథ్వీపతికి కళంకము తెచ్చిపెట్టెనుగదా! ఛీ! యీకులటయున్న నేమి మడిసిన నేమి. అయ్యో! నీచురాలా! నీకెంతయుద్దేశముగలెనే.

తే. గీ. హృదయమున నెగ్గుసిగ్గులు వదలివేసి
నీచుడైనమేదరివాడ నిల్గుచుంట
వింతదాసివె నీవును యింతుడైన
లెక్కసేయక నీవిట్లు నక్కుచుంటి.

దైవమా నేనిప్పుడు నెవరికై విచారించెదను?

మ. అకటా మేదరికేరి జారయయియ? ట్లల్లాడు చెల్లాయి పా
ట్లకునైకుందుదునా? జయంతునికిబా ల్లంచున్విచారింతునా?
యికమాయీయపకీర్తికై మదిని నే నేమంచుదుఃఖింతునా
యికనానీచపు జీవమొందుకనినా కేనేనుశోకింతునా?

ఓకరుణానిధీ నాపాట్లుయేమనిచెప్పెదవు! కన్నీల యీవూయజగంబు లోనుంచెదవు. అయ్యోనాకల్లార యీనీచపు కార్యము గాంచ లేనే! మిత్రమా! ఖడ్గము నంగుము. ప్రాణహత్యగావించుకొందును!

జయపా— స్నేహితుడా! ఎందుకీతొందర? నామాటలాలింపుము.

చ. కలతవహించకయ్యా కల కాలము కష్టములుండబోవు కా
వలసినవాటికై మదిని బాధలఁజెందెద వేలనీవు యీ
దలపుఁనుండకయ్యా చెడు ధారుణియందున వింతలయ్యా నా
పలుకులఁయాలకింపుమది ప్రార్థన జేసెద ప్రాణమిత్రమా?

కావునమిత్రమా! నాయందుదయగలిగి విచారింపకయుండు వాటికై యాలోచింపుము. ఇట్లుండ లాభమేమి!

వీర— ఏమియుఁ బలుకుటకు నోరాడకున్నది. ఈకులట యెంతపనిగావించెను. భర్తను తాను స్వయముగా వధించి యేమియు యాలోచనదట్టక నీవు రక్షించుటకు చనుదెంచ యీసందనపైమోపి యీకారాగృహప్రాప్తి చేసెనా! అక్కటా స్త్రీలెంతమాయలాండ్రు! (ప్రభావతి నుద్దేశించి) ఓసీ మాయలాడిప్రభావతీ! ఎంతదారుణముగావించితివే! నీవెంతయో తల్లిదండ్రులకుఁగీర్తిఁ దెచ్చెదవని వారు వారిమనంబులలో నాహ్లాదబడుచుండ నీవిట్లుగావించెదవా! అకటా యెంతఘోరకార్య మాచరించితివి. మిత్రమా యింకనన్ను యద్దుచేయకుము, యీదుష్కా

ర్యముగావించిన యానీచురాలిని నాకరవాలంబున ఖండించెద.

(ప్రభావతిపై కేగ నెంచుచున్నాడు)

జయపా— ఆపి) నీవట్టి కార్యము చేయుట మంచిపని కాదు.

వీరసే— అట్లయినచో నట్లుచేసెద (రాజభటులను కేక వేయును)

వెంక— (ప్రభావతితో) అల్లాసూడు! యేదో గొంపముంచావు! యిల్లెరి యేరో సేస్తున్నారు. నాపాపాలు పోగొట్టావే! అంబాబో నాకీసంసారిసాంగత్తెంవద్దు, వద్దు, వద్దు.

ప్రభా— నాదేహమంతయు కంప మెత్తుచున్నది. అరుగో ఆవేళగాషాయి వస్త్రము ధరించుకున్న సన్యాసియు, అయ్యోగారో; యింకేమన్నది. నాచావుమూడినది. నాసోదరుడగు వీరసేనుడు కూడ యారుదెంచినారు. అయ్యో నాగుట్టు వెల్లడయినది. అయ్యో మేదరినాయనా యిప్పుడెంగుబోదును. నన్ను రక్షించువారెవరు?

రాజభటులు ప్రవేశించుచున్నారు

రాజభ— మహారాజకుమారా! వీరసేనా! యేమిసెలవు?

వీర— రాజభటులారా! అందున్న యాయిద్దరిని కారాగృహవాసులు గావించుడు.

(రాజభటులు వారిద్దరను దోడుకొనిపోవుదురు)

జయపా— మిత్రమా! మనమాచరించవలసిన కార్యమేమి?

వీర— స్నేహితుడా! నామనంబు యెంతయో కలతజెందుచున్నది. మా తండ్రిగారికి యేమియపకీర్తి వాటిల్లునో కదా? ప్రజలు యేమని నింద జేయుదురో గదా? అయ్యో యావింతచూచి మాతల్లి బ్రతుకగలదా? మాతండ్రి బ్రతుకగలడా? కులంబునకెల్ల కళంకము దెచ్చిన యానీచురాలిని చంపినను పాపముండునా? స

ర్వాబాంధుజనులు నిందించరా? మహాపాతకము సంభవింపదా? నేనింటికి యెట్లుపోగలను.

జయపా—మిత్రమా! నీవేమియు సంశేహింపనలదు. పోవుదము రా.

(నిష్క్రమింతురు.)

రంగము —రాజసభ

(చిత్రకేతుఁడు, వీరసేనుఁడు, జయవర్మ ప్రవేశించుచున్నారు.

చిత్ర— వీరసేనా! నిశిరేయిని కుమారి సౌధంబు చొచ్చి జయంతుని చంపిన సన్యాసి గూర్చి నేఁడువిచారణకదా? అందలి సత్యాసత్యం బులు నీకేమి తెలియును.

వీర—అంతయు సిద్ధముగానే యున్నది. (ప్రక్కకు దిరిగి) సేవకా! ఘుటురమ్ము.

సేవకు—(ప్రవేశించి) అయ్యా! యేమిసెలవు?

వీర—నీవుపోయి కారాగృహమున నుంచబడిన కాంతను పురుషుస నదివఱకున్న సన్యాసిని దోడ్కొనిరమ్ము.

సేవకు—చిత్తము. (నిష్క్రమించును.)

వీర—తండ్రీ! నమస్కారము.

చిత్ర—నిన్నరాత్రి కారాగృహనివాసులుగ జేయబడిన పురుషుఁడును కాంతయు యెవ్వరు?

వీర—తండ్రీ! అదంతయు మీకొక త్రుటి కాలములోనె విశదమగును ఇంతలోనె వచించి మీకు విచారము కలిగించనేల? అదంతయు మీయంతట మీరే విని విచారణ చేయవచ్చును.

చిత్ర—ఇదివరకే విచారపడుచున్న నాకు మరింత దుఃఖముకలుగునా? ఏమియీవింత? అయ్యో భగవంతుఁడు నన్నేమి చేయదలచినా ఁడో గదా? నాయదృష్టమెట్లున్నదో!

వీర—తమకేవిచారము గలుగచేయదు. సర్వబంధుజన దుఃఖకారణమ ుయియున్నది. జయంతుని వధ మన కుటుంబమునకు కళంకము దెచ్చినది తను పుత్రికారత్నము యొక్క పూర్వజన్మసుకృతము.

చిత్ర—కుమారా! ఇంచుక నాకుఁ దెలుపరాదా?

వీర—తండ్రీ! నేవచింపనేల? నేరస్థులు భటులతో బ్రవేశించుచున్నా రు వీక్షింపుము?

(సన్యాసి వేషధరుఁడగు జయపాలుడు ప్రభావతి, మేదరివెంకడు ప్రవేశించుచున్నారు.) (కొందరు రాజభటులు వెంటనే ప్రవేశించు చున్నారు)

చిత్ర—వీరసేనా ప్రభావతికూడ నేరస్థులలోనున్నదేమి? ఆమె యేమ యిన నేరముచేసియున్నదా? ఇదంతయు నాకేదో వింతగలిగిం చుచున్నది. లేక నేను కలగాంచుచుంటినా?

వీర—తండ్రీ! నాటకిమంతయు యీమెతో పిండియున్నది. ఆమెనీపు త్రిక నాసోదరీ రత్నము. కులంబునకు మణిపూస.

చిత్ర—కుమారా! నామనంబంతయు యాందోళ పడుచున్నది ఆహా ఏమి యీనేరస్థులు ఇదంతయు నాయొక్క యదృష్టము గాబో లు!

వీర—జనకా! నీయొక్క యదృష్టమున కేమిలోటు. నీకీపుత్రికారత్న మున్నంతకాలము రాజ్యము మహా సౌభాగ్యము జెందును. దే వరవారు నాసోదరి నడిగి కారాగృహ నివాసమునకుఁ గారణ ము తెలిసికొనుడు.

ప్రభా—(శిల వంచుకొని విచారించుచున్నది)

చిత్ర—అమ్మాయీ! విచారించెద వేల. నీవు కారాగృహమున కేగు టకు కారణము వచింపుము.

వీర—సోదరీ! విచారింపకుము పూర్వకృత ప్రకారమిట్లు జరుగుచుండు లే? కారణము లన్నియు తండ్రిగారితో భీతిలేక వచింపుము?

చిత్ర—అమ్మాయీ! నీసోదరుడు నిన్ను బ్రతిమాలుచున్నవ్వాడు స మాధానమిమ్ము.

వీర—తండ్రిగారూ! మీరు శ్రమజెందకుడు. గుట్టంతయు బయలెక్క నది. రాజసభయందు సత్యాసత్యములు వచింపని యెడల నిజ ము నిలకడమీద తెలియును

చిత్ర—కుమారీ! నీవాలస్యముగావించక నిజము త్వరగా జెప్పుము. నీవేమైనను యపవాదులు చేసితివా? లేక మంతనములు యేమై నను బల్కితివా? ప్రత్యుత్తరంబిమ్ము.

ప్రభా—తండ్రీ! చెప్పుట కేమున్నది. ఇదినాజన్మ కృతమువల్ల సంభ వించిది. నాగొక్క దురదృష్టము చేత పక్కడికి నన్ను యీ డ్చుకొని వచ్చిరి. అంతకంటె నేనేమియు నెరుగను. (తనలో)అ య్యో! దైవమా! మమ్మేల బట్టబయలు గావించితివి. అకటా యీరహస్యము నాసోదరునకే తెలియవలెనా? తెలిసినను మ మ్మేల యిక్కడకు దీసికొని రావలయును. యింతకు దైవకృప యెట్లున్నదోగదా?

చిత్ర—ఓరీ సోదరి! రాజభటులు నిన్ను చెఱసాలలో నెంగుకుబడవై చిరి? నిజమంతయు వక్కాణింపుము.

వెంక—మారాజా! నామాటలాలకించుడు. నేనే పాపంయెరుగను. ఒ ట్టిపున్నాన్ని మీకాడకు లాక్కొని వచ్చారు బాబు! నాకత్తితో డు బాబు రచ్చించాలి. నాపెల్లాంతోడు. నాకు రాచభటులు నం

కళ్లు యేచిబంధిఖానాలోఁ దోసారు బాబూ! రాజాగారూ! మీ పాదాలకాడ బ్రతికేవాడిని.

చిత్రి—కుమారా! ఆసన్యాసియందలి దోషమేమి?

వీర—ఓయి! సన్యాసి కాషాయి వస్త్రములుధరించి నీవుకూడ కారాగృహప్రాప్తిగల్గెనా?

జయపా—అయ్యా! ఆనాడు రాత్రి ప్రభావతి సాధు వచ్చి యీమె భర్తను వధించితనని.

చిత్రి—ఓయి! సన్యాసీ, నీవు నిజముగా వధించితివా?

జయపా—అయ్యా అందుచేతనే నన్ను కారాగృహములో బడవైచినారు.

వీర—ఓయి! నీవు నిజమంతయు దెలుపుము. నిజముగా నీవే వధించితివా?

జయపా—అయ్యో! నేనేమి విన్నవించెదను. వధించినది లేనిది యీ పరమాత్ముడగు భగవంతునికి దెలుసును నాకుదెలియును. నేరమంతయు నాపై మోపబడెను.

వీర—నీవు నిజమంతయు నిలుకడ మీద తెలప గలవా? అందుకు దగిన సూచనలన్నియు చూపింపుము. నీకెవరి మీదనైన యనుమానము గలదా? వచింపుము.

జయపా—రాజా! మీరెట్టి దండన విధించినను యానీచమగు కార్యములు నోటితో వచింపజాలను. ఈయొక్క శిక్షకు నేనేపాత్రుడనయ్యెదను. అందలినిజము మీరాయంతట మీకు దెలియగలదు.

వీర—ఓరీ! మేదరీ! యీసంగతి యంతయు నిజముగా పలికెదవా? లేనియెడల నీకు మరణశిక్ష ప్రాప్తమగును.

వెంక—(తనలో) అంబాబో! నాకొంపమునిగింది నాగానం బయలోడింది నాప్రాణం పోతాది యింక నన్ను బతకనీయ్యరు అయ్యో

యెర్కా యీరాసపిల్లని పట్టాను. ఆపాపుకోరిక నాకేలపుట్టాలే నాబుద్ధిగడ్డితిని రాసకులాని పాపుచేసానుగదా! యీలాంటి తగయిదాలు వచ్చేపను లెన్నడు చేయగూడదు యింక నేను నా పాణం పోగొట్టుకోవాలి నాపిల్లాంబిడ్డలు నాకోసం యేడుస్తారు అయ్యో! దైవం నాకీ గొడవలు తెచ్చాడేమి? యింక నిజం సెప్పకపోతే గార్యంలేదు (ప్రకాశముగా) మారాజారచ్ఛించండి మీపాదాలు పట్టుకుంటాను. యింకమీకాడ అబద్దం సెప్పను. ఆమీదదేవరోరదయసూపించాలి. మీరేమిచేయుమన్నా చేయడానికిసిద్ధంగున్నాను. నన్ను సంపినాసరే నిజం సెప్తాయినండి మీపబావతిగారికి నాకు రెండేళ్ల మట్టిసరసాలుజరుగుతోన్నాయి నాపమాణపూర్తిగా నిజంయింతే బాబూ!నన్ను రచ్ఛించండి ఎరగక సేసాను ఇంక బుద్ధిగానుంటాను లెండి.

చిత్ర—(తనలో) అయ్యో! దైవమా! యిట్టి కర్ణకఠోరమైన సంగతులు జరుగునని కలనైనను దలుపలేను. అకటా! యీమాటలువిని నంతనే నాగుండెలు బద్దలగుచున్నవి. నేసింక బ్రతుకజాలను. ఈమాయ దేవుడు నన్నేల యీమాయా ప్రపంచములో బుట్టించవలయును అయ్యో వంశమునకు యీకళంకము వచ్చునని కలనైనను యెరుంగజాలను. "తులసి మొక్కకు గంజాయి మొక్క" పుట్టినరీతిగా నా కడుపున యీతుచ్ఛరాలు జన్మించెను నేను నాబంధువులను యెట్లుచూడగలను. నాకింకెవ్వరు దిక్కు. మారాచవంశమున యీతుచ్ఛరాలు యేలజన్మించవలయును ఆహా! కాలమహిమ సిచకులమున పుట్టినమెదరిని రాకులమునజన్మించి మనంబున భీతిలేక యీకార్యము గావించినదా? అయ్యో! ప్రభావతీ యీబుద్ధి నీకేల గలిగెనే ?

తే. గీ. పాలవంటి కులంబెల్ల ౹ పాడుచేసి
భీతినొక్కింత లేక యీ ౹ వేషలాడి
మేదరిని గూడికులమెల్ల ౹ బూదిచేసి
భర్తప్రాణము దీసెను ౹ మాయలాడి.

అయ్యో యీనిచురాలను ధాత్రీశుడు సహించరాదు. కటకటా యీమె నాకేల యుద్భవించెను దైవమా! దయచూడుము.

వీర—(రాజును విలోకించి తండ్రీ) విచారించెదవేల? ఇటువంటి వింతలు సహజముగా లోకమునందిట్టి కాలమున జరుగుచుండెను. అయినను మన పూర్వజన్మసుకృతము.

చిత్రి—నందనా! ఏమియు నాకుం దోచకున్నది. ఎన్నడు దలంచియుండని యపకీర్తి సంభవించినందుకుం గొంచెము విచారము కలుగుచున్నది.

వీర—రాజా! దుఃఖించిన లాభమేమి? ఇంకముందు జరుగబోవు సంగతులు నాలకింపుము. దానన్ ధైర్యము గలుగును.

చిత్రి—(మేదరితో) ఓరీ. తరువాత సంగతి చెప్పుము.

వెంక—అయ్యా! ప్రతిదినము యీపిల్ల మాపులు నాగుడిసికాడకు వచ్చేది. ఆబిడ మొగుడొచ్చిన రేతిరి కూడా నాకాడకు వచ్చింది. యీ రోజు యాలసం జేసింది, యేంయి యివ్వాళ యింత జాగుచేసావేం యని యడిగాను బాబు. నేను మాయింటికి నాభర్త వచ్చాడు యాలస్యం చేసానుయని సెప్పిందండి! అల్లాగయితే మన సేనాం భంగంవత్తాదియని సెప్పానండి. అప్పుడు పభావతి నన్ను కత్తి యడిగిందండి. ఎందుకని నే నడిగానండి. నాభర్తను సంపుతానుయని సెప్పి వెళ్లిందండి. నేనొద్దని సెప్పానండి. నామాటయినక మెల్లి సంపొచ్చిందండీ? మా రాజాయిదండి నాసంగతి,

చిత్రి—(తనలో) అహా! స్త్రీలలో నెంతయినను మాయలాండ్రు కలరు వారు యెంతకైనను జాలుదురు.

తే. గీ. పైకి యెంతయో మంచిగా నగుచుందు
కలవకుటిలులు గొప్పల కాంతలకును
భర్తవిడనాడి విటులకు భార్యలై
కాలమంతయుమారెరు కాంచిచూడ.

అకటా! భర్తను విడనాడుట యేకాక పరపూరుషునిఁ జేరి భర్త ప్రాణములు యిహలోకసుఖముల గానపడితీయుచున్నారు. అయ్యో! రాజకులంబున జన్మించినీచకులముతో జన్మించిన నీ మేదరి కూడుట దురన్యాయము. (పరిభావని నుద్దేశించి) ఓసీ మాయలాడీ నీవింత పని చేయుదువని నేఁదలఁచి యుండలేను. మా రాజకులంబునకుఁ గీర్తిసంపాదించెదవనియు, యత్తవారికి వన్నె దెచ్చెదవనియు నమ్మియున్నమావంటివారిని దుఃఖాబ్ధిలోఁబడవైచితివే? అయ్యో నేసు ప్రజలయెదుట తలయెత్త జాలను. చంద్రమతి, ద్రౌపది, సావిత్రినోలె సీ భర్తకు శోభిల్లెదవని నా మనంబులో నెంతయో యాత్రపడియున్న నన్ని ర్బుల పాల జేసితివా?

వీర—మేదరీ, తరువ యి సమాచార చెప్పుము.

వెం—ఆ రేయి నాదగ్గిఱ యీయమ్మ కత్తిపట్టికెళ్లి భర్తను సంపేసి నాకాడకు వచ్చిందండి బాబూ! వచ్చి నే సంపుతుండగా యేరో బైరాగి వేసముతో వచ్చి, సంపకు, సంపకుమన్నాడట బాబూ! మా సన్నాసి మాటలు యినక సంపేసిందట బాబూ! అప్పుడు రాజభటులను కేకేసి బైరాగిని తనభర్తని సంపినట్లు సెప్పి యాతనిని ఖైదులో వేయించిందంట బాబూ! నాకాడకు వచ్చి యీసంగతి సెప్పిందండీ. అయ్యా నేసత్తెంయంతా సెప్పాను. నన్ను రచ్చించాల. మీపాదాలుకాడ బతికేవాడిని

ప్రభా—(తనలో) అయ్యో! యీమేదరి నారహస్యమంతయుఁ బూస గ్రుచ్చినట్లు వచించినాఁడు. నేనింకేమంతనము బన్ని తప్పించుకొనుటకు వీలులేదు నేను యిఁక నిజము మాసోదరునితో చెప్పవలసి తీరును. అకటా! పతినివిడనాడి పరపూరుషుని జేరుటవలన వచ్చెడు కష్టము లివిగదా?

వీర—ప్రభావతీ! యీమేదరిపలికిన పలుకులన్నియు నిజమేనా? లేక నీవుయేమైనను మారువచించెదవా?

ప్రభా—(తనలో) అయ్యో! నేనిప్పుడు యేమని జవాబు నీయఁగలను తలయెత్తి మాటలాడగలనా? ఈభూమిమీద బ్రతుకగలనా? అకటా! నేనేమిచేయగలను. నామాటలాలింపువారెవ్వరు (అని యూరకుండును)

వీర—తనలో) అకటా! యీమాయలాడి భర్తనుచంపుటనిజమే! అందుచేత నే మాటలాడుటకు నోరాడకున్నది. (ప్రకాశముగా) సోదరీ! మారుమాటాడవేమి? ఆమేదరి పలుకులకు యంగీకారమేనా?

ప్రభా—సోదరా! నన్ను పదిమారులు పలికించి బాధపెట్టుటేల? మేదరి పూసగ్రుచ్చినట్లు యంతయువక్కాణించెగదా? నన్నింకయడుగ నేల! సమస్తంబును నీకుఁ దెలిసియేయున్నది, నాయొక్క దురదృష్టమువల్ల నాకీనీచుడుప్రాప్తమయినాడు. ఇదంతయునా పూర్వజన్మసుకృతము. ఈపాడునిగాడి రాజకులంబునకెల్ల కళంకము తెచ్చిపెట్టిననావంటి నీచురాలు యీభూమిపైబ్రతుకుట హేయము. నాకీజారత్వమువల్ల సంభవించుకష్టములన్నియు యిప్పుడు నాటినవి. కాన నావంటినీచురాలను నీకరవాలంబున నఱికి పుణ్యంబుఁగట్టుకొనుము. దోషమంతయు నాదే కానిమేద

రిది యెంతమాత్రము లేదు అతఁడు నాకెన్నియో నీతులు చెప్పె డివాడు కాని నేను నిరాకరించితిని. మేదరి చంపవద్దని చెప్పి నాడు. కాని, మాకడ్డము గలుగునని నేచంపి సన్యాసిమీద నింద వైచితిని.

వీర—ప్రభావతీ! నీభర్తను వధించినందుకు నీప్రాణములుఁదీసి తీరవల యును. కావున నే కాఠిన్యముబూని నీమీదగలిగినకూర్మి, ప్రేమ ము వీడి —కార్యము గావించుచున్నాను నీతల్లి నిజూడగోరెద నే ని యొకసారిపోయిచూచిరమ్ము. నీప్రాణంబులు బాయుటకు సం సిద్ధవైయుండుము.

ప్రభా—సోదరా! ఇట్టినీచకార్యంబు యాచరించి నాతల్లిముఖారవిం దమెట్లు వీక్షించెదను. అయినను నన్నుచిన్నతనంబునుంచి పెం చి పెద్దచేసియున్న యామె నెకసారి దర్శించివచ్చెదననుగ్రహిం పుము.

వీర—ఓరీమేదరా! జయంతవధనుగురించి నీకేమియు శిక్షలేదు కాని, యామెకుఁ బ్రోత్సాహపఱచినందుకు నీవు నీజీవితకాలము కా రాగృహములోఁగడపవలెను. నీకదియే శిక్ష. (రాజభటులను చూచి) భటులారా యీప్రభావతిందోడ్కొని మాజననిదర్శిం పఁజేసి పిమ్మట కింకరులకప్పగించి యురిదీయింపుడు. ఈమేదరిని కారాగృహనివాసిగాఁ జేయుడు. ఇదియే నాయొక్కయాజ్ఞ పొండు.

వెంక—(తనలో) ఓరి బాబో! నాకొంప మునిగిందిరా యింకయిది యే నాకుశిక్ష నాకింక తప్పదు. (ప్రకాశము) మారాజా నన్ను రక్షించుడు. నేనీసిచ్చపొంద లేను బాబూ! నేనాబద్దం సెప్ప లే దు. నాయందు దయవుంచాలి బాబూ! యింతకఠినసిచ్చ

వద్దండీ. నాప్రాణాలు బోతాయండీ! అయ్యో ప్రభావతీ నాకెంత గోల తెచ్చావమ్మా? అయ్యో నాపిల్లాంబిడ్డలు యేడుస్తారండి! అమ్మయ్యో! నేనాచీకటికొట్టులోనుండలేనండి. ప్రాణాలుబోతాయండి. మావాళ్లు రాసపిల్లస్నేయంవద్దనిసెప్పారు కాని నేను యినకబోతిని. నిచకారంగా పండంటిరాసకులంపాడిసేసాను. మంచిసెడ్డలు నాలోచింపలేకబోతిని. నన్ను యీరాకుబ్రతుకనీరు. అయ్యో! యీపాడుపని సేయుటవల్ల యిప్పుడు నాకొంపమునిగింది. దేవ్రుడా నాభారంనీమీదపారేసాను ఆపైన నీయిట్టం. నన్నురచ్చించాలిసుమా?

(భటులుసంకెలలు దగిలించితీసికొనిపోవుదురు)

ప్రభా.—(తనలో) ఆహా! పతినిబాసి హేయమగు యీమేదరినిగూడుటచే నాకీశిక్షప్రాప్తించినది. పతిభక్తిమించినవస్తువీజగంబున నింకఁగానరాదు.

తే. గీ. ఎట్టిపాపంబుఁజేసితి । నేనుతొల్లి
పరువుపోయెనునిందల । పాలనైతి
భర్తవిడనాడిమేదరి । భార్యనైతి
ప్రజలయెదుటనుతలయెత్తి । మసలలేను.

తుచ్ఛసుఖంబునకాసించి మహాదుష్కార్యంబుఁ గావించితిని. ఆహా! నావంటిదీజగంబుననుండిననేమి, మండిననేమి! భర్తనువధించిలోకనిందపాలైతిని. జననీ జనకులకుఁ గళంకముఁదెచ్చి పెట్టితిని. చేయరానిపనులెన్నియో నాచరించితిని. నామూలంబు పండంటికులంబంతయు పాడయ్యెనుకదా! చేతులారా ప్రాణనాథునిఁజంపి హేయమగు మేదరినిఁగూడియిహలోకసౌఖ్యముల కాసించితిని

చ. కటకటయెంతపాపమిది । కానకనీచకులంబునందుయా
కుటిలునిఁగూడిప్రాణపతి । గొంతుకఁగోసితి, మానివర్యునిన్

కఠినములైనమాటలనుఁ గల్పనఁ జేసివచించియాతనిన్
భటులకునప్పగించితిని మానముభంగముఁ జేసుకొంటినే.

నేఁటిదినంబున నే ప్రాణములుఁ బాయుచుంటినే! అయ్యో! నానాధునిని ప్రకారణముగా చంపి నరక ప్రాప్తిఁ జెందుచుంటినే! ఏమి యీమాయజగము ఆహా! యేమి యీమానవుల వెర్రిమమకారము. నేఁటితో నాకు సర్వమునాశనముకదా?

శా. మాయామేయజగంబెనిత్యమని సంభావించి మోహంబునన్
ఏయన్యాయములైనఁ జేయుచునుతా నీలాగునన్ బృథ్విలోఁ
గాయంబేస్థిరమంచునెంచిమదిలోఁ గార్పణ్యమున్ గల్గుచున్
మాయావేషముఁగల్గిస్త్రీలిటుల సౌభాగ్యంబుగానుండిరో.

అకటా! జగంబంతయు నీరీతిగాఁ బరిణమించుచున్నదికదా! అయ్యో యిప్పుడు నాజనని ముఖంబెట్లుగాంచకలను. భర్తసేవ విడనాడజారిణినై చరియించినందుకుఁ దగిన శిక్ష ప్రాప్తించినది.

వీర—భటులారా, యీమెను మాతల్లికడకుఁ దోడ్కొని పోయి మా జననితో నీరీతిగాఁ బల్కుఁడు.

మ. అనుమానంబునొకింతలేకఁ జెడుమా యామేదరిన్ గూడిస
జ్జనవంద్యున్సుగుణాకరున్ శుభకరున్ జాలిన్ మదిన్ బూనకన్
దనభర్తన్, నిదిరించుచుండగ మహా ధైర్యంబుతోఁ జంపెమీ
తనయారత్నమటంచుఁ జెప్పుడుమనో దారుఢ్యమున్ గల్గుచున్.

అందుచే రాజుగారు రిశిక్షనిచ్చిరని విన్నవించి వెంటనేఁ దిరిగిఁ బ్రవేశించుడు. ఆవంతయును నాలస్యంబుఁ జేయకఁదక్షణముర౦డు.

(రాజభటులు ప్రభావతిని దోడ్కొనిపోయిరి.)

చిత్ర—కుమారా! నేనిఁకప్రజల మోముఁజూడ చాలను.

జయవ——దేవా! కాలానుకూలముగా ననేకవింతలు జరుగుచుండును. అందుకై మనము చింతిలకూడదు. కాని, మీరేమియు మదినిఁ గుందక చరియించుడు.

తే. గీ. బ్రహ్మయేరీతినొసటను వ్రాసినాడో?
యట్లుజరుగునుఁదప్పక యరసిచూడ,
దానిదప్పింపనెవ్వరి తరముకాదు!
చెప్పచుంటిని, వినుమింక యొప్పుగాను.

కాననోరాజా! ఇదిమనపూర్వజన్మ సుకృతము. అందులకై మీరెంత మాత్రమువగవకుఁడు. ఇంక మనమువచనెదమురండు.

చిత్రి——మంత్రివర్యా! నాకెంతమాత్రము భీతిలేదు కాని యీనీచు రాలు యిట్టిదుష్కార్యము నొనర్చునని కలనైనను దలపలేదు.ఇం తకు దైవము నన్నేరీతిచూచునోఁగదా!

వీర——తండ్రీసెలవుగైకొనెద.

జయావ——రాజా! ఆలస్యమేల నిష్క్రమించెదమా?

(నిష్క్రమించిరి)





# జయంతజయపాలము.

## చతుర్థాంకము.

—:రంగము:—

(ప్రవేశము:- వీరసేనుఁడు, జయపాలుఁడు.)

వీర—మిత్రమా!

తే. గీ. నీదురూపముజూడ ము । నీంద్రువోలెఁ
గానుపించుచునుండెను । కరుణతోడఁ
దెల్పుమింకను నీరూపుఁ । దేటగాను
గల్లఁజెప్పకు నాకింకఁ । గమలనేత్ర.

జయ—నీవువచించినట్లు నారూపము మునీంద్రునివలె గాన్పించుచుండును. కాని యీరూపము నిజరూపంబు కాదు. కొండొకకారణాంతరమున యీమాయవేషంబు ధరించినాఁడను. ఆసంగతంతయు నేనిప్పుడు వచించుటకుఁదగిన సమయంబు కాదు. అందులకు నన్ను క్షమింపుము. పూర్వజన్మమున నే నెద్దియో పాపంబుఁ జేయఁబట్టి నాకీకారాగృహప్రాప్తిసంభవించినది. నీయొక్క కరుణచే బయటఁబడి నీకీనిజస్థితిఁ దెల్పితిని.

వీర—సఖా! నీవెంత చెప్పినను నేనునిన్ను వీడఁజాలను.

తే. గీ. చెలినయుండఁగనేను నీ । చెంతచేరి
మంచిమాటలుఁజెప్పి నీ । భావమంత

నార్చి నేను నీకెంతయో కైమైత్రినిచ్చి
మెల్గుచుంటిని నీతోడ ♦ మేలుగాను.

కానవో మిత్రమా! అట్టిమహాకష్టంబునుంచి నిన్ను తప్పించి నీకు సౌఖ్యంబును గూర్చిన నీయనుంగు సఖునికి నీనిజరూపంబుఁ దెల్పవా ? నన్నేల బాధపెట్టెదవు !

జయ—వీర పేనా! నన్ను నీవు చెఱనుంచి విడిపించినందులకు నీకుఁ దగిన యుపకారము నొనర్పలేదా ? కాఁబట్టి నన్ని విషయమునఁ గరుణజూడుము.

వీర—వయస్యా ! నీ కేమి కావలయునో అది తెచ్చియిచ్చి నీకోర్కెలన్నియు నెరవేర్చెద కనుక నీనిజరూపంబుఁ దెల్పుము

జయ—నిశ్చయముగా నాకోర్కెలు నెరవేర్చెదవా? మునీశ్వరాదేశము నిజమేనా? అంకలకు సందియము లేదుగదా ?

వీర—నిశ్చయముగాఁ జేసెద భీతిఁ జెందకుము.

జయ—అట్లయిన నా ప్రియమిత్రుఁడగు జయంతుని యస్తికలుఁదెచ్చి యిమ్ము. నేనవి నిత్యభక్తితోఁ జూచుచుండెదను. నాప్రాణమిత్రుడను బాసినందుకు నేనెంతయో వగచుచున్నాడను.

వీర—మిత్రమా నీయభీష్టమిది యేకదా ? తప్పక నొసంగెద. కావున నీచరిత్రము విన్నవింపుము.

జయ—నేనాతని ప్రాణమిత్రుడను; మంత్రికుమారుఁడను.

వీర—ఇఁక నేబోయివచ్చెద (నిష్క్రమించును)

జయ—నేనింటికిఁబోయి నా భార్యగుణంబులఁ బరీక్షించెద.

(నిష్క్రమించును.)

—:రంగము:—

(అంతఃపురము—సుగుణవతి విచారముతో)

సుగు—అమ్మో! దైవమా! యెంతపనిగావించితివి రాజకులంబున యింతటికళంకమువచ్చునని నేఁగలనైనను దలఁపనైతినిగదా? ప్రభావతీ! ఎంతటిదోషంబులాచరించితివే? అంతఃపురనివాసివై నీచకులంబునపుట్టిన యామాయమేదరిని గూడుటకు నీమనసు యొప్పుకొనెనా? ఆహా కాలమెంతలో మారెను?

తే. గీ. పతినివిడనాడి విటకాండ్రఁ ౹ బజ్జచేరి
కుల్కుఁజెందుచు మాటలు ౹ బల్కుచుండి
పుడమిని బతివ్రతలటంచు ౹ పొగడు...
కాంత... ౹ ...గడపుచుండె.

సుగు. మాయలాడీ! ప్రభావతీ! ఎంతపనిగావించితివే! అయినను యెవరి యూహాను యెవరెరుంగఁగలరు.

తే. గీ. మబ్బుగోపలబొద్దును ౹ మనసునందు
నాటియున్నట్టి యూహాను ౹ నీటిజాడ
నెవ్వడెఱుంగఁగలఁడయ్యా ౹ యెంచిచూడ
నట్టికుట్రలుయుండును ౹ మాత్మయందు.

కాన నవితెలుసుకొనుటకు బ్రహ్మకైనను దరముగాదు. ఆహా! ప్రభావతీ! యెంతఘోరకృత్యముగావించి యీరీతిగా మెలంగుచుంటివే?

సీ. కన్నపుత్రికవంచు ౹ నెన్నియుంటినిగాని
కులటవయ్యెదవంచు ౹ దలఁపనైతి
సుగుణాపురాశివై ౹ శోభిల్లుదువటంచు
తలపోసితిగాని నేఁ ౹ దలఁపనైతి
పతిభక్తిచేయుచుఁ ౹ బరిఢవిల్లుదువంచు
దలపోసితీరీతిఁ ౹ దలఁపనైతి

వెలలేనికీర్తిలో వెలుగుచుండెదవంచు
దలపోసితీరితిఁ దలఁపనైతి

తే. గీ. కులట! నీకామమునుదీర్చు కొనఁగ జెనటి
మేదరినిగూడి నీవిట్లు భీతిలేక
భర్తప్రాణములనుఁదీసి భావమందు
మెలఁగనెంచితే! నీవిట్లు మేలుగాను.

మరియు

శా. ప్రాతఃకాలమునందు లేచి మదిలోఁ బాపంబులేనట్లుగా
భీతిన్జెందక నాకు బెట్టిచనుచున్ వేషంబులన్వేయుచున్
జాతుర్యంబునుగల్గి మేదరికి తా సానై ప్రవర్తించెనో
నీతిన్గేకనుసుందలొచ్చెయకటా నేనెట్లుజీవింతునో!

అయ్యో! యీరీతిగాపత్నిమై మెలఁగి రాజవంశమునకు కళంకముదెచ్చి పెట్టెనుగదా? ఇంకలకు నేనేమనుకుందును? ప్రభావతీ యెంతపనిచేతివే? కలనైననుఁ గ్రుప్షనైతినిగదా! స్త్రీకిపతియేకదా దైవము.

క. మగఁడుదరిద్రుడైనచెడు మానసుడైననురోగియైననున్
మగువకుతాండె వేల్పతఁడె ప్రాణము ద్రవ్యము సర్వకాలమున్
మగనికిఁగందలొబ్బినను మానిసిబ్రోచి భరించుచుండునో
తగదనియెంచకూడదిటు దైవముమెచ్చదు యట్టికాంతలన్.

ప్రభావతీ! ఇందునిన్ననవలసినదోషములేదు ఇదంతయు నాదోషము. నన్నుచిన్నతనంబునుంచి మిక్కిలి ప్రీతితోపెంచి పెద్దజేసియున్న నీతల్లిదండ్రులకు నిందతెచ్చితివా! అయ్యో! నేనెంతనివిలపింతును. లోకుల మెదుటతలయెత్తగలవా సర్వబంధుజనమున కయిష్టమయితిమే? పాలెంటికులము పాడుచేసితివా!

(ప్రవేశము. ప్రభావతి, భటులు)

సు—అయ్యా! మీరెవ్వరు?

భటు—అమ్మా! రాజగారనుమతిప్రకారము మీపుత్త్రికగు ప్రభావతిగారిని భవదీయదర్శనార్థమై తోడ్కొనివచ్చితిమి.

సుగు—అయ్యో! నాకింకపుత్త్రికెవ్వరు పండువంటి రాజకులమునకు యెప్పుడు కళంకముఁ దెచ్చి పెట్టినదో యప్పుడే నాకు పుత్త్రిక లేదు.

ప్రభా—(తనలో) అయ్యో! నేనిప్పుడు యీ మెముఖారవింద మెట్లు వీక్షించెదరు.

భటు—తల్లీ నేఁడుమధ్యాహ్నంబున ప్రభావతిగారిని వధ్యభూమికిఁ గొనిపోయి యురిదీయుమని రాజుగారిశలవైనది. అందుచే యీమెను యిక్కడకు దీసుకొనివచ్చితిమి.

సుగు—రాజభటులారా! మహాపాపియగు ప్రభావతిని నాకుజూపింపక తక్షణము వధ్యభూమికఁ గొనిపొండు. ఆదుష్టురాలు ముఖము నేనువీక్షించను.

ప్రభా—అమ్మా! ఎఱుగక నేనీచకార్యమాచరించితిని నేనుపూర్వజన్మమున నెట్టిమహాపాపమాచరించితినో యీనాడు యిట్టి నిందలుపాలజొచ్చితిని నావంటిమహాపాపి యీభూమియందు జీవించరాదు.

సుగు—ఓసీ మాయలాడీ! ప్రభావతీ నీకుమాట్లాడుటకు నోరుయెట్లు వచ్చినదే!

ప్రభా—అమ్మా! నాయందున్న తప్పులన్ని యుక్షమింపుము నావంటి మహాపాపులు యీలోకంబున యింక లేరు.

సుగు — భటులారా! ఈమెను నాయెదుట నుంచకుడు. నేనింక యీమెను చూడజాలను. ఈకష్టము భరింపజాలను ఈలోకములో బ్రదుకజాలను.

భటు — (ప్రభావతితో నిష్క్రమించుచున్నారు.) (అందఱునిష్క్రమింతురు.)

రంగము—చారుమతి సౌధము

(ప్రవేశము చారుమతి)

చారు — (తనలో) ఆహా! భగవంతుడ నన్నేలయిట్టులీరట్టులపాలు జేయుచుంటివోగదా! నేనొనర్చిన మహాపరాధం బేమి! నాకిట్టిమోసముగల్గునని కలనైనను దలపలేదుకదా! నాకువివాహమై దాదాపుగ యేడెనిమిది వత్సరంబులు కావచ్చుచుండెను కాపురమునకువచ్చి నాల్గుసంవత్సరములాయెను. నేనునాప్రాణేశ్వరునితో నొకవత్సరము సుఖంబుగానుంటిని తరువాత దేశాటనచేసివచ్చెదనని చెప్పియింతవఱకు మాయింటికివచ్చి యుండలేదు. కారణమేమై యుండునోగదా! హా! జీవితేశ్వరా! యిది నీకు తగునా?

చ. అరగితినీవువాదుగతి । నారయనైతివి ప్రాణనాథ యీ
తరుణికినిట్టికష్టములు । దాల్చుట పాడియెదోషమున్నచో
గరుణవహించి ప్రేముమిట । కాంతనుపీడుట న్యాయమౌనె నే
నిరతముగుందుచుంటిమది । నీకొఱకున్ నను గాంచువెంటనే

అయ్యో! నేనిప్పుడు యేమనివగతును! ఏదేవునికి మ్రొక్కెదను. హా మనోహరా నావల్ల నేరంబేమి? నిన్నువిడనాడి యీరీతినిన్నివత్సరములుండవచ్చునా? అగ్నిసాక్షిగ బెండ్లియాడిన నాయెడయింత నిర్దయవహించుటకునావలనలోపం బేమి?

తే. గీ. చేయలేను దుష్కార్యముల్ జెనటికాను
పలుకలేదు దుర్భాషలఁ భావమందు
అగ్నిసాక్షిగఁ గొంటివి యాత్మయందు
నిట్టినన్ బాయఁ గారణ మేమొ యెఱుఁగ.

మఱియు,

మ. పతియే దైవమటంచు నెంచితిని నా భావంబులో నిత్యమున్
మతి నొక్కింతయు లేక నేనిటులయో పాపంబులో మున్గితో
సతి నిట్లున్ విడనాడి నీవిటుల సంసారంబునన్ బాసి యీ
గతి నీవుండుట భావ్యమా నె? మదిలోఁ గారుణ్యమున్ గల్గుమా?

నిరంతరము నీనామమే దైవమంత్రమువలె పఠించుచు భజించుచున్న నాయందు యిప్పుడైనను కృపవహింపవా? ఇన్ని సంవత్సరములు విడనాడి యుంటిరికదా! నాబ్రతుకేమగునోఁ దోఁచలేదా? జీవితేశ్వరా!

తే. గీ. మగువమీఁదను బతికెంత మక్కువుండు
మగనిమీఁదను సతికెంత మమతయుండు
యువిదలకుఁ గాపురంబె యొప్పియుండు
నట్టి విడనాడ భావ్యమె? అఖిలచరిత.

ఉ. ఎన్నిదినంబులయ్యెఁ గని యేమని చెప్పుదు నామనంబులో
మన్ననచేయుచుంటి నిను మానసమెంతగొ కుందుచుండెనా
కన్నులనుండి బాష్పములుఁ గారుచునుండెను సుందరాంగ నీ
వున్నతెఱంగు దెల్పు మన సొప్పదు నమ్ముము జీవితేశ్వరా?

భర్తచెంగటిలేని కాంత బ్రతుకు నిష్ప్రయోజనముకదా? అయ్యో! భగవంతుడు నాబ్రతుకిట్టిదిగా నొనర్చెనా? నన్ను నేకీర్తిగంటి చూపునైనను జూడక పోవుట పాడియా?

సీ. కోపమా నేచేయు ౹ పాపమా నాయొక్క
లోపమా తెల్పుమా ౹ రూపవంత
నేరమా లేకనే ౹ భారమా నేనంత
పాపినా తెల్పుమా ౹ భవ్యచరిత
దోసమా నాయందు ౹ దుష్టనా నేనీకు
వాదమా నాతోడ ౹ పద్మనేత్ర
యందమా యిదినీకు ౹ చందమా లేకయా
నందమా చెప్పుమా ౹ యఖిలచరిత
తే. గీ. ఎంత వేడిననన్ను నా ౹ వంత యైన
కరుణ జూడవదేమియో ౹ కారణంబు
వేచియున్నందులకు నన్ను ౹ బ్రేమతోను
వచ్చి గాంచుము నన్నింక ౹ పరమపురుష.

ప్రాణనాయక నేనంత అయిష్టురాలనైతినా? అకటా! నేనింకెవరిని వేడ కొందును. (ఇంచుకయూరకుండి) దైవమా నీకైనను నాపైదయ గలుగలేదా? ఇందులకుఁ గారణమేమైయుండును. నేను నీకు భక్తురాలనుగానా? మావంటియనురాగ పాశములు వేరు పరచ వచ్చునా? ద్రౌపదీమానసంరక్షకా? కంసారీ! నన్నేల గరుణఁ జూడవు. శ్రీకృష్ణా! దీనదయాళూ! నీదీనదయాళుత్వ మెందుదాగినది. అయ్యో నీస్మరణ నిత్యము చేయుచు, నీవే నాతల్లివి దండ్రివని నామానసంబులోఁ నెంచుకొనుచుండ నన్ను రక్షించవేఁ. నీలమేఘశ్యామా? నీవే నాకు దిక్కు.

మ. యదువంశోత్తమ! పుండరీకనయనా ౹ యార్తావనా! దేవనా
మదినిన్ జొచ్చి కృపారసంబున ననువ ౹ న్బల్కించి నాభర్తనున్
మదిలోఁ జూపుము మ్రొక్కుచుంటి నినునా ౹ భావంబులో దైవమా
పదిమారుల్వచియింపలేను వినుమీ ౹ పద్మాయతాలోచనా?

మరియు

ఉ. పాపము లేదు నాయెడను ॥ భక్తితొఁ గొల్చుచునుంటి నిన్ను యీ
కూపమునందు నుంచి నను ॥ కోటివిధంబుల బాధపెట్టుచున్
గోపముఁ గల్గియుంటివ యయో ॥ కూడదు నన్నిఁకఁ గావుమయ్య భూ
వ్యాపక! మ్రొక్కుచుంటి నిను, ॥ భర్తనుఁ జూపుము సత్వరంబుగా

సురరక్షకా! నేనిట్టుల రట్టుల పాలన నుండవలసినదేనా? శరణాగత వత్సలబిరుదాంకితుడవు, నన్నేల గరుణ జూడవు. దైవమా? నేను నీకొనర్చిన పాపమేమి? ఓ భగవంతుడా! నీకు నాప్రేమానుపూర్వకముగా నంజలొసంగుచున్నాను. కైకొని నన్ను రక్షించి నాణేశ్వరు నిత్వరలోఁ జూపింపుము. రామా, రామా, రామా?

ఉ. దానవనీతినీతిగుణ ॥ ధాముపరాత్పరు నొల్లిఁ దాటకా
దానవిప్రాణముల్ గొనిత ॥ ధారుణియందునఁ గీర్తిగాంచియా
కానలకేగి రాక్షసుః ॥ గర్వమడంచిన రామచంద్రియా
మానినిఁ బ్రోవుమయ్యవిను ॥ మాః సమాతయుఁ గల్లజెందెనో?

ఇదియే నాకడసారి ప్రార్థన మాలి-చిరక్షించుము. దశావతారా! రామా! కావుము, కావుము, నాప్రాణేశ్వరుని నాకంటికిఁ జూపుము, నామొరాలింపుము! (నేలపైఁ బరుండును)

(ప్రవేశము మధురవాణి.)

మధుర——(తనలో) అక్కటా! ఏమి కారణము చేతనో గాని చారుమతీ దేవిదుఃఖాబ్ధిలో నల్లలాడుచున్నది. అదియుఁగాక.

చ. తుడువదు కన్నులన్ వెడలు ॥ శోకకణంబులు కొప్పు చక్కగా
ముడువదు నీరమున్ గొనదు ॥ ముచ్చటకైననుఁ బొట్టు పెట్టదో
గుడువదుయన్న మేమియును ॥ కోరదు పువ్వుల నెంతమాత్రమున్
గడుపుచునుండె కాలమును ॥ గారణమేమిటో? తెల్వదక్కటా?

ఇందుకై తల్లిదండ్రులు శోకించుచున్నారుకదా? ఆహా, ఏమి! ఆమె సుశీలను?

తే. గీ. అత్తమామలనెంతయో । యాదరమున
జూచి, మఱదుల నెంతయో । సొంపుగాను
భక్తిగల్గుచు నింటిలోఁ । భామయెపుడు
పనులు చేయుచునుండును । తనివితీర.

మఱియు

చ. పతియనుమాటవిన్నకను । భక్తియుఁగల్గుచు సేవఁజేసి తా
సతతము పుణ్యగాధలను । జక్కఁగఁ జూచుచు దైవసేవయున్
వ్రతముల నెన్నియో! యితర । వాంఛలవేమియు లేకఁ జేయుచున్
సతియిటుకాలమంతయును । చక్కఁగఁగడ్పును సర్వరీతులన్.

అకటా! అట్టిచారుమతీదేవి యేమి కారణము చేతనో గాని మూడువత్సరంబులనుంచి దుఃఖము చే నిండి దీనురాలుగానున్నది.

సీ. వనితమాటాడదు । వనకేళిఁగోరదు
జలకంబులాడదు । జలజలాక్షి
పాటైనపాడదు । యాటైననాడదు
చెలియలతోనుండదు । కలసియెపుడు
తలనైనదువ్వదు । పూలనుముడువదు
ముకురంబుజూడదు । ముద్దుగాను
శయ్యపైనుండదు । సరసంబులాడదు
నిదురించుచుండును । నేలపైఁ

తే. గీ. యేమికారణమోగాని । యింతియిట్లు
కాలమంతయు భీతితోఁ । గడుపుచుండె
దీనికై తల్లిదండ్రులు । దిగులుఁజెంది
భర్త చెంగట లేడని । భ్రాంతియేమొ?

అందుచే నీమె మూఁడు వత్సరంబులనుండి శోకవార్ధిలో మునిగియుండె ను. అకటా! ఆమెభర్త రాజకుమారునితో దేశాటనఁ జేయుచుండెను గదా? ఆహా! పూర్వస్థితిఁ దలఁచుకొన్న హృదయంబు నీరవుచున్నది.

చ. పినతనమునకు మేమటులఁ బ్రియుఁడొనర్చితి మెంతకాలమో
వనములకేగి యాటలను బాటలుఁ బాడుచు నల్పియుంటిమో
మనమున భీతిలేకనటు బంగరుడోలికలందు నూఁగియా
వనితయు నేనుఁగూడి కను వైభవమున్ చరియించి యుంటిమో

(చారుమతి వైపుఁ జూచి) అదిగో, చారుమతీదేవి నేలపైఁ బరుండి యున్నది. పలుకరించిన నేమికోపము వచ్చునో గదా? అయినను బలుకరించెదను. (సమీపించి) దేవీ! దేవీ! అని పిలుచును

చారు—ఎవరు నాకు? నా ప్రాణనాధుఁడేనా! జీవితేశ్వరా! ఎప్పుడరుదెంచితిరి? అని లేచును)

మధుర—అమ్మా! నేనుమీ చెలికత్తెనగు మధురవాణిని. ఏలనట్లు పలువరించు చుంటిరి. పాడుకలనేమైనను గనియుంటిరా?

చారు—చెలీ! లేదు. లేదు.

మధుర—కొంచెముకతడవు విశ్రమించెదవా?

చారు—సఖీ! నిదుర వచ్చుటలేదు.

మధుర—చెలీ! నేను నీకు పతివ్రతాధర్మంబులు వచింపుమని విన్నవించియుంటినిగదా!

చారు—అవను. ఇదివరలోఁ జెప్పియుంటివి

మధుర—ప్రియసఖీ! నేనొక ప్రశ్నయడిగెద వచించెదవా?

చారు—అది యేది?

మధుర—ప్రపంచములో నన్నిట కంటె యెక్కువైన విలవవస్తు యువిదలకేది?

చారు—చెలీ! నీవు నాకంటెవయసున చిన్నదాన వయినను పతిభక్తి గలుగుటచే మంచిప్రశ్నయడిగితివి. అందులకెంతయో నేనానందించుచున్నాను. దానికి సమాధానము నీకుఁ దెలియదా?

మధుర—తెలియును కాని, నీవేమనెదవో యని సందియ మొందుచుంటిని.

చారు—అట్లయిన వచింపుము.

మధుర—పతిసేవయే కదా?

చారు—అవును.

చ. మగఁడు కురూపియైన చెడు ♦ మానసుఁడైనను జారుఁడైననున్
దగఁడనియెంచకూడదిటు ♦ దైవము మెచ్చడు యట్టి కాంతలన్
మగువకతండె దైవము స ♦ మానము ప్రాణము భూషణంబులున్
వగవకఁబ్రోచుచుండవలె ♦ భర్తను భక్తితో సర్వకాలమున్.

మఱియు,

సీ. పతియన్నమాటలు ♦ భామకుశోకగా
శారీరబాధలు ♦ సమసిపోవు
సతతశుభాకార ♦ మతివఁజూడంగనే
వెలలేనిలాభంబు ♦ గలుగుచుండుఁ
బతినిసేవించినా ♦ సతికెంతొకీర్తియు
ఘనముగాగల్గును ♦ కాంచిచూడ
యతనిసన్నామము ♦ యాత్మలోఁదలచిన
సంసారదుఃఖముల్ ♦ సన్నగిల్లు

తే. గీ. నట్టిపతియందుమానసు ♦ ననవరతము
నిల్పియున్ననులలితకు ♦ నీమమొప్పు
మోక్షమార్గము పుణ్యము ♦ పొందఁగలుగు
కాన మగఁడుయే దైవము ♦ కాంతలకును.

ప్రాణనాథుడెట్టి దుర్మార్గుడైనను నాతనిని దైవంబువలె భజించెడి కాంతనే పతివ్రతాశిరోమణి యందురు స్త్రీలకు వ్రతము లన్నిటిలోఁ బతియను వ్రతమే ముఖ్యము. పతికి సర్వసేవలు నాచరించుచుండవలెను

మధుర—సఖీ! పతి పరదేశవాసుఁడై యుండునేని యేమిచేయవలెను.

చారు—ఆహా? చిన్నతనమైనప్పటికిఁ దగిన చక్కని ప్రశ్న యడిగినది. ఇందులకు నేనేమని ప్రతివచనం బివ్వను. (ప్రకాశముగా) మధురవాణీ! సాధ్యమైనంతవఱకు భర్తను భామ యెడఁబాసి యుండరాదు. అట్టిదొకవేళ సంభవించెనేని పతివ్రతయగు కాంత, జలకంబులాడదు. ముకురంబుఁ జూడదు. పూలుదురుమదు. వనకేళిగోరదు. తొడవులు తొడువదు. తాంబూలమాచరించదు. నిత్యము పతిరాక కెదురుచూచుచు సకల ప్రియోజనంబుల యందును విరక్తయై మనోజానలంబునం బొగిలెడి మగువవోలె నుండును.

తే. గీ. పతిని దైవమంచును నెంచి । భావమందు
మసలునోయట్టి మగువలే । పతివ్రతలయి
నిత్యవేళల భర్తను । నేర్పుగాను
పూజసేయుచు భక్తితో । మ్రొక్కుచుండ్రు

సతి యెప్పుడు పతిమనం బెట్లుండునోఁ గనుగొని యాప్రకారము చరియించుచుండవలెను. మఱియు అత్తమామలయందు భక్తిగలిగి మఱఁదులయందుఁ గరుణ జూపుచునుండవలెను. అఖిలవిధంబులైన పూజలఁ జేయుచు హరిగాథలాలించుచు గురువులనుఁ బూజించుచు, పరపురుషులను సోదరులగ భావించి మెలంగవలెను. పెరవారలతో సతి ప్రసంగము చేయరాదు.

మధుర—చెలీ! నేడు నీవలన యీపతివ్రతా ధర్మములన్నియు నేరు కొంటిని. నాహృదయంబంతయు మహానందమున నోలలాడు చుండెను.

చారు—సఖీ, భర్త చెంగటిలేని కాంతబ్రతుకు నిష్ప్రయోజనముకదా? మధురవాణీ! యట్టి నాయవస్థకు నెంతయో చింతించుచుంటిని. నాభర్తనుగాంచి నేటికి మూడు వత్సరంబులయ్యెఁగదా? అకటా భర్తనుఁగాంచ కెన్నిదినంబు లిట్లు గడపను. భర్తయే కదా భామకుఁ దోడునీడ. చెలీ! నేను నిక్కంబు వక్కాణించు చుంటిని. ఇంక నాభర్తను కొన్నిదినంబులలోఁ గాంచనేని ప్రాణ ములఁ బాయుటకు సంసిద్ధురాలనై యుంటిని. ఇట్టిభర్త చెంగ టలేని భామ బ్రతికిననేమి మడసిననేమి?

మధుర—దేవీ, విచారించిన లాభమేమి? కాలమెప్పుడు నొకరీతిగా నుండదు. నీవు నీభర్తనుఁ ద్వరలోఁ జూడగలవు.

చారు—చెలీ! వట్టిమాట. భగవంతుఁడు నానొసట నిట్లు వ్రాసియుం డగ నెవ్వరితరము తప్పించుటకు?

మధుర—సఖీ!

**తే.** గీ. దైవమిప్పుడు నీకింకఁ గ దయనుఁజూపి
నీదు భక్తికి మెచ్చుచుఁ నేర్పుగాను
వరములను నిచ్చి నీయొక్క వాంఛదీర్చి
ప్రాణనాధుని వెంటనేఁ బడయగలను.

దైవము నీయెడఁ ద్వరలోఁ గృపజూపును. నేనిఁక గృహమునకుఁ బోవు చుంటిని. చాలా ప్రొద్దుపోయినది. (నిష్క్రమించిరి)





శ్రీ

# జయంతజయపాలము.



## పంచమాంకము.

(చారుమతి సౌధము)

(ప్రవేశము జయపాలుఁడు చారుమతి)

చారు—మనోహరా!

శా. ధన్యంబైతిని నేఁడు మిమ్ముఁ గని నాథా! నమ్ము నిక్కంబుగాఁ
గన్య న్వీడి చరింప వచ్చునె? మది న్గారుణ్యము న్బూనకన్.
అన్యాయంబును వీడి మీరు నను మీ యన్యోన్యసంప్రీతితోఁ
గన్యన్ బ్రోవుము మ్రొక్కుచుంటి మదిలోఁ గౌతూహలం బయ్యెడిన్

జయపా—ప్రేయసీ! అట్లను చుంటివేల! నేను చేసిన మహాన్యాయంబేమి? నాయందు లోపములుఁ గలవా యేమి!

చారు—మూఁడు వత్సరములనుంచి, మీదర్శనంబునకై వేచియుంటిని. నన్ను మీరు వీడి దేశాటనఁ జేయుటకుఁ గారణమేమిటోఁ దెలిసినదికాదు. నాయందుఁ గోపముఁ బూని చనిరేమో యనుకుంటిని. నేఁడు భవదీయముఖారవిందసందర్శనంబునఁ జేసి పుణ్యురాలనైతిని.

మ. ఇదియే నాసుదినంబు ప్రాణప్రియ నేఁ డెంతో మహానందమున్
మదినిన్ గల్గుచు పొంగుచుంటి వినుమీ భావంబునన్ దెల్పితిన్

మదినూహింపక వేఱుత్రోవలను మీ భార్యా శిరోరత్నమున్
బదవేగంబునఁ బ్రోవుడీ కరుణతోఁ బంతంబు లింకేటికిన్.

వెండియు,

తే. గీ. కాంచితిప్పుడు మీరూపుఁ గరువుఁదీర
కాలమంతయు నాకెంతో కష్టమయ్యెఁ
గడపలేకను దుఃఖముఁ గాంచినాను
నేఁడుఁ జెందితి యానంద మెంతయైన.

సీ. నన్నుఁ బాసినదాది నాకేమిఁ దోచకఁ
గల్త లెన్నియొ జెంది కాలమంత
దుఃఖసాగరమునఁ దొర్లుచు గడిపితి
నిద్రాహారము లేదు నీరజాక్ష
సతిని బాగయదగునె సంసారమును వీడి
సంతోషమును లేక సారసాక్ష
బాధలన్నియు నన్నుఁ బట్టి మెలఁగుచునుండెఁ
దోఁచు నిడయు లేదు శోచ లేదు.

తే. గీ. అట్టినీరూపు జూడఁగ నాత్మయందు
గలిగె నానందమెంతయో జలజలాక్ష
మ్రొక్కుచుంటి నీకాలికును ముద్దుగాను
యఖిలచరితమా! నన్నింక నాదరింపు.

జీవితేశ్వరా! ఇదిగో నాయం జలిగ్గికొని దీనురాలనుఁ గాపాడుము.

జయపా—చెలీ, కొన్ని కారణాంతరముల నేఁ వ్యవధిలేక గృహంబుఁ జేర లేదు. అందుచే నింతకాల మాలస్యమైనది. నాయందు కృపవహించి మన్నింపుము.

చారు—నాథా! మీరంతమాట నాడజెల్లునా నేను మీపాదసేవకురాలను గాదా?

జయపా—ఎందుచేత నంటివా?

మ. సరసీజానన నిన్ను వీడి కడునే | సంచారముజ్జేసితిన్
బరమానందము నొందుచున్న నినునే | బావంబులో ముంచినే
చెరసాలప్బడి కష్టముల్ బడితినా | స్నేహంబుకై, నీవునా
చరణాబ్జంబులు నమ్మియుంటివి కృపన్ | సైరింపుమీసుందరీ.

చారు—ప్రాణేశ్వరా! మీరట్లనుట పాడియా? నేను మీ తప్పు క్షమించుదాననా?

మ. పతియే దైవము సర్వముం దనకునా | ప్రాణంబునున్ భార్యయే
గతిలో నున్నను ప్రాణనాథుడె మదిన్ | గాపాడుగా నిత్యమున్
గతనాస్తియను మాట నిక్కమిఁక యా | గాథల్ వృథాలౌసుమీ
మతి యొక్కింతయు లేదు నాకుఁగృపతో | మన్నింపు ప్రాణేశ్వరా?

అయ్యో మీరు లేనప్పుడు నేనొందిన యారాటమింతయని చెప్పుట కలవి కాదు.

సీ. ఒకమాటు నిదిరించి | యొకమాటు లేచుచు
కలతజెందుచు నుంటిఁ | గాంతనాథ
ఒక మాటు భుజియించి | యొకమాటుఁ జదువుచు
కష్టంబు నొందితిఁ | గమలనేత్ర
ఒకమాటు పనిచేసి | యొకమాటు కూర్చుండి
నిందలెన్నియొ పడ్తి | నీరజాక్ష
ఒకమాటు మాటాడి | యొకమాటు నడచుచు
కాలంబు గడిపితిఁ | గరుణఁజూడు

తే. గీ. మదినినేనెంతో మీమీద | మమతగల్గి
ప్రతిదినంబున మిక్కిలి | భక్తితోను
మ్రొక్కుచుంటిని నేనిట్లు | ముద్దుగాను
పాడియేయిది నీకునో. | పరమపురుష

అట్టి మీయొక్క దాసురాలను మిమ్ము నేను మన్నింపఁగలనా? నాకిం తగూతౌరము సౌఖ్యము లేక యుంటిని.

జయపా—ముగ్ధురాలా, నిన్ను పుట్టింట నుంచుట నాకుభావ్యమా ?

చారు—నాథా! నాకష్టములన్నియు, మీముఖారవింద సంద ర్శనంబుకై గదా? అట్టి నేను మీముఖకమలముఁ జూడగానే నాకష్టములన్నియుఁ బాసి నన్ను మహానందము ముంచినవి. అట్టి మీరెంతమాత్రము సందియము నొందవద్దు. (ఇంచుక యూరకుండి) ప్రాణేశ్వరా! దీనికేమిగాని మీస్నేహంబుకై కష్టములఁ జెందితిరనికదా చెప్పియుంటిరి! ఎందుచేతనో నాకిం చుకఁ గారణంబుఁ దెలియచేయరాదా ?

జయపా—ఎరుగుదువుకదా, మారాజకుమారుని? మేమెంతయన్యోన్య రాగంబులో మెలంగితిమో యంతకష్టముఁ జెందుచుంటిమి.

ఉ. నేను జయంతుఁడున్గలసి నిత్యముఁ బోవుచు నవ్వనంబులో
గానము చేయుచుండ నొక కాంతయు మాకడకేగుదెంచి మా
ధ్యానముమార్చి మార్చి ఘన ధారుణి మైత్రిని పాడు జేసెనా
పైన జయంతుఁడల్గితన ప్రాణముఁ బాసిన కారణంబుగా.

అకటా! యీరీతిగా నతండు నన్నుఁ బాసి యనేక కష్టములఁ బాలఁజేసి నన్ను చింతాంభోధిలో ముంచి ప్రాణములను గోలుపోయెనుగదా? అకటా మాస్నేహమైత్రి చెప్పతరమా?

సీ. ఒకకంచమునఁ దిని యొకమంచమునఁగల్సి
నిదరఁజెందితిమేము నేర్పుగాను
ఒకచోటకేగుచు నొకచోటనాడుచుఁ
గూర్మితోనుంటిమి కోమలాంగి

ఒకమారుచదువుచు నొకమారువ్రాయుచు
మెల్గియుంటిమిమేము మేలుగాను
ఒకమారుబడికేగి యొకమారువచ్చుచుఁ
నొకయింటనుంటిమి నొప్పుగాను

తే. గీ. అట్టిప్రాణమిత్రుడు బాసిగిట్టిపోయె
నకట మామైత్రిచెప్పుట కలవికాగు
కలదె? మైత్రినిమించిన విలువవస్తు
వేదియైననుభూమిలో నిదియుఁగాక

తరుణీరత్నమా?

ఉ. ఏమనిచెప్పువాఁడ నిఁక నేదియుఁ దోపక నామనంబులో
క్షేమములేదు కష్టములఁ జెంగుచునుంటిని సుందరాంగి యా
కోమలి దేహయాత్ర నెటు గూల్చుక పుణ్యముగట్టుకొంచు నే
రామునినే భజించెదను రాజకుమారునిఁగూడియుండెదన్

కావున ప్రేయసీరత్నమా! నాకీమాయసంసారమేల? నాప్రియమిత్రుఁడు నన్నెప్పుడు బాసెనో నాటితో నాసౌఖ్యములు నీటఁగల్సెను.

చారు—జీవితేశ్వరా! జయంతునియకాలమరణంబునకుఁగారణమేమి?

జయపా—ప్రాణేశ్వరీ! అవన్నియు నిప్పుడుచెప్పుటకలవికాదు. నాకు నిదురవచ్చుచున్నది. ఇంచుకసేపు విశ్రమించెద (పరుండి) చెలీ! ఆమంచముక్రింద మూట నంటకుసుమీ (పరుండును)

చారు—ఇదియేకదా, నాసుదినంబు; నాప్రాణనాధుని సుందరవదనారవిందముఁ గాంచి ధన్యురాలనైతిని. (ఆలోచించి) నానాధునికినిదురపట్టినది. ఈమంచముక్రిందనున్న మూట నంటవలదని కదా వచించెను. ఇందేమియున్నదోఁగదా! ఇది నాకయితెచ్చినవస్తువై యుండును. నాధుడు పరిహాసమునఁ బలికియుండును. కావున విప్పిచూచెదను. (అట్లుచేయుచున్నది)

ఆహా ! ఏమిది అస్తికలమూటయ్యెనే, ప్రియుఁడు నాకొఱకేదియో తెచ్చెననుకొంటినే ? తుదకివి యస్తికలయ్యెను. ఎప్పటివలె మూటగట్టి మంచముక్రింద నుంచెదను. (అట్లుచేయును)
(మంచముక్రిందనుంచి జయంతుఁడు లేచుచున్నాడు)
(చారుమతి ప్రక్కకేగును)

జయం—(కోపముతో)

మ. భయమొక్కింతయు లేక నీవు మదినా ౹ భార్యామణిన్గూడి యా
శయలోనిట్టులనుంటివే వినుము నీ ౹ శౌర్యంబునంజూపినన్
భయమావంతయు లేక నిన్ను చెఱుపనీ ౹ ప్రాణంబులన్దీసి నే
దయయొక్కింతయు లేక యుండెదను సం ౹ తాపంబుననున్దీర్చెదన్,

ఓరీ, క్రూర మిత్రద్రోహీ ! ఎంతకార్యంబాచరించితివిరా ! సిగ్గులేక నా కెన్నియో నీతులఁగఱపి పరస్త్రీని గూడుట భావ్యము కాదని యానాడు చెప్పి యావనములో విరోధించి నావెనువెంటఁబడి నాకిట్టి కార్యమాచరించితివా ? అకటా, నీవిట్టివాఁడవని దలఁపలేదు.

సీ. కపటమెంతయు లేకఁ ౹ గరుణఁగల్గెదవంచు
దలపోసి యీరీతిఁ ౹ దలఁపనైతి
ప్రాణమిత్రుఁడవంచు ౹ భావమందున నేను
దలపోసి యీరీతిఁ ౹ దలఁపనైతి
సుగుణంపురాశివై ౹ శోభిల్లుదు వటంచు
దలపోసియీరీతిఁ ౹ దలఁపనైతి
బ్రాహ్మణభక్తిచేఁ ౹ బరిఢవిల్లుదువంచుఁ
దలపోసి యీరీతిఁ ౹ దలఁపనైతి

తే. గీ, క్రూర పీశాచమునుదీర్చు ౹ కొనఁగమిత్రు
భార్యనే కోరితివినీవు ౹ భావమందు

చూడుమింకను నిన్నింక ? సొంపుగాను
కఱకుఁగత్తి నిబూనుచు ? నఱుకుచుంటి.

ఇట్టికార్య మాచరించిననన్నుఁ జూడరాదు! (అని చంపఁబోవుచు)

చారు—ప్రవేశించి (తొందరగా)

మత్తకోకిల. తాళుతాళుముతాళుమిప్డు-ధైర్యమెంతయు గల్గుచున్
గూలనేయుటమంచిదే యిది-కూడదంచును నెంచుమా
బాలుఁడో యిది నీకు నెంతయు-భాగ్యమిచ్చును చూడుమా?
జాలినొందుము చంపకింకను-శౌర్యమంతయు వీడుమా ?

జయంతు—(ఆశ్చర్యముతో) అహా! ఏమిది యీమె నాభార్య కాదే? (భయము జెందుచు) ఓ కాంతాశిరోమణీ! నేనేమి చెప్పుటకు నోరాడకున్నది. నేను నీనాథునకుఁ బ్రియసఖుఁడను. నాపేరు జయంతుఁడు. నేను మాయత్తవారింట భార్యాసమేతుఁడనై నిదురఁజెంది యిక్కడ మేల్కాంచితిని, నాకామాయావిశేషము లేమియుఁ దెలియరావు. నాభార్యనుగూడినాడని దలఁచి కోపావేశంబున నొడలుఁ దెలియకఁ జంపఁబూనితిని. అంతలో నీవు వలదని చెప్ప నాగితిని.

చారు—రాజరత్నమా! నీవు గతించితివని నాప్రాణనాథుడు వచించియున్నాడు. అట్లు యీసౌధమునకువచ్చి యెట్లుజీవించితివో జెప్పెదవినుము.

జయంతు—సోదరీమణి! నాతప్పులన్నియు మన్నింపుము.

చారు—నానాథుడు నిదురించుచుండఁ, యీమంచముక్రిందనున్నమూట నంటవలదని చెప్పి నిదురించిరి. అంతటామూట నేవిప్పిచూడ యస్థికలు గానఁబడెను. తిరిగి లేచుచుండ నీవువచ్చి యీరీతిగాఁ జేసితివి.

జయంతు—నేను నీవలనఁ బ్రతికితిని (పాదములమీఁదఁబడి)

చ. పరమపతివ్రతామణివి ¶ పాదముఁబట్టి నమస్కరింతు నే
నిరతముఁగొల్చెదన్విను ము ¶ నిందలు లేకనుఁ బ్రోవుమన్న యీ
నరసురనాగలోకముల ¶ నాకికఁ బుణ్యముఁగల్గునట్లుగాఁ
వరములనిమ్ము నాకుభయ ¶ భ్రాంతినిఁ బాపుము నాసహోదరీ!

చారు—రాజరత్నమా, లే, లెమ్ము.

చ. పరసతులెల్లఁ దల్లులుగ ¶ భావనసేయుము వెల్లవేళలన్
బరధనమన్న హాలహల ¶ భంగిగఁ జాతువు బొంకవెన్నఁడున్
బరుషములాడ వెవ్వరిని ¶ బ్రాహ్మణభక్తియు దైవసేవయున్
నిరతముఁ గల్గియుండెదవు ¶ నిక్కమునమ్ముము రాజనందనా?

జయపా—(మేల్కాంచి) ప్రేయసీ, యెందుంటివి?

చారు—నాథా! మీయింత్రిండగు జయంతుఁ డీసౌధమునకు వచ్చి యున్నాడు.

జయపా—ఆహా! ఏమిది, నాభాగ్యము. నాయనుంగుసఖుని నేఁడునా కన్నులారఁ గాంచితినికదా? ఓయీ! జయంతా చచ్చియున్న నీ వెట్టుబ్రతికితివి.

జయంతు—ప్రియుడా! ఇదంతయు, సీభాగ్యశిరోమణిప్రభావము.

జయపా—రమణీ? ఇందుల నిజస్థితి వర్ణింపుము?

చారు—ప్రాణనాథా? మీరు నిదురించుచుండగ మంచముక్రిందనున్న మూటనుఁదియ్యవద్దని వచించిరిగదా? కాని మీరు పరిహాస మునఁ బల్కితిరని నిశ్చయించుకొని, యామూటఁదీసి చూచితిని. అందుయస్థికలు కనఁబడగాఁ దిరిగి మూటఁగట్టితిని. అంతట జ యంతుఁడులేచివచ్చి మీరు యాతనిభార్యపజ్జను పరుండిరని యెంచి మిమ్ములను నరకుటకు వచ్చుచుండ, నేనాపి నిజస్థితి యాతనికిఁ దెల్పితిని. అంతలో మీరు మేల్కాంచితిరి.

జయపా—(తనలో) ఆహా! ఏమి నారమణీప్రభావము!

తే. గీ చూడగల్గితిమిత్రుని ౹ సుదతివలన
భామభాగ్యంబు లెన్నియో ౹ ప్రబలుచుండె.

(భార్యతో)·

యేమిచెప్పుదు నాపుణ్య ౹ మిపుడునీకు
నిన్నుఁ బోలినచేడియ ౹ లెందుగలరె.

జయంతు—ఓతరుణీశిరోమణీ, మహాపతివ్రత వగునీకు నమస్కరించు చున్నాను. (నమస్కరించును) (జయపాలునిజూచి)మిత్రమా నే నెట్లునరకిఁబడితిని,

జయపా—అదంతయు నీకుఁ దరువాత రహస్యంబుగఁ జెలపెదను. ఇంక మనకేమి కావలయును.

జయంతు—ఇంకఁగావలసిన దేమున్నది?

తే. గీ. వర్షముల్ కుంభవృష్టిగ ౹ వరలుగాక
ధాత్రిసస్యసమృద్ధిమై ౹ తనరుఁగాక
సంపదలతోడ నలరారి ౹ జనులుయెపుడు
వారలన్యోన్యమైత్రిని ౹ బఱగుఁగాక.

చారు—తథాస్తు

(అందఱు నిష్క్రమించుచున్నారు)

పంచమాంకముసమాప్తము,



## శారదావిజయము.

గ్రంథకర్త—కొడాలి సత్యనారాయణరావుగారు. వెల 0-12-0

## సంగీత చంద్రకాంత.

గ్రంథకర్త—కొడాలి సత్యనారాయణరావుగారు. వెల 0-12-0

## మహానంద.

గ్రంథకర్త—కొడాలి సత్యనారాయణరావుగారు. వెల 0-12-0

## రసపుత్రవిజయం.

గ్రంథకర్త—ద్రోణంరాజు సీతారామారావుగారు. వెల 1-0-0

## తారాబాయి.

ఆంధ్రదేశచరిత్రసంబంధమైననవల.

గ్రంథకర్త—ఆకెళ్ల వెంకటకృష్ణశర్మగారు. వెల 1-0-0

## రెట్టమతశాస్త్రము.

ఇది రెట్టడనునతడు కన్నడభాషలో వ్రాసినగ్రంథమును సత్యవోలు అప్పారావుగారు తప్పులనుసవరించినగ్రంథము. వెల 1-0-0

## భీష్మప్రతిజ్ఞ.

గ్రంథకర్త—అవసరాల శివగిరిరావుగారు. వెల 0-12-0

## మాతృదాస్యవిమోచనం

గరుత్మంతుని చరిత్ర. వెల 0-12-0

వలయువారు టి. వి. రమణయ్య అండు బ్రదర్సు,

# కాళిదాసుచరిత్ర

బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిచే మృదుమధురముగా వ్రాయఁబడిన గ్రంథము 1 కి వెల రు 1—0—0

## తెనాలి రామలింగ కవిచరిత్ర.

సత్యవోలు అప్పారావుగారిచే వ్రాయబడిన గ్రంథము

వెల రు 1—0—0

## దండకరత్నావళి.

ఇందు 20 దండకములు కలవు వెల రు 0—12—0

బాలకవి. గరికిపాటి కామేశ్వరరావుగారిచే రచియింపఁబడిన

## నాటకములు.

1 సంగీత జయంతజయపాలము. వె: 0-8-0

2 సతీసోనరాణి (అచ్చగుచున్నది) 1-0-0

3 పతిభక్తి డిటో 1-0-0

4 మాధుర్యమనోరమ డిటో 1 0 0

కేటలాగు కోరిన పంపఁబడును.

వలయువారు—

టి. వి. రమణయ్యా, అండ్ బ్రదర్సు.

నేషనల్ బుక్కుడిపో,

రాజమండ్రి. అని వ్రాయవలెను.

